# చందమామ
# కేమెల్
## రంగుల పోటీ
ప్రవేశ రుసుము లేదు




**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు



ముక్కను చుక్కల గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిర్ణయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________ Age __________

Address ________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.
ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-8-1979

**CONTEST NO.10**

VISION



# చందమామ

ఆగస్టు 1979



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-25

సంవత్సర చందా: 15-00




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [ ''దివ్యజ్ఞానం'' ]కు ఆధారం గుండాల విజయ రచన. అనేకమంది భవిష్యత్తు తెలుసుకోవాలని జాతకాలు చూపిస్తారు. భవిష్యత్తు గురించి జాగ్రత్తపడటం నిజంగా వివేకమైన పనే. భవిష్యత్తు బాగుండటానికి ఎన్నో జాగ్రత్తలు తీసుకుంటాం. కాని మార్పులేనప్పుడు భవిష్యత్తు తెలుసుకోవటం అవివేకం.

## అమరవాణి

విపత్తిః కాలసంజాతా దుర్వారా యేన కేన చిత్;
సాయం పద్మవనేజాతా హానిః కేన నివార్యతే ?

[కాలానుగుణంగా వచ్చే ఆపదను ఎవరూ తప్పించలేరు. సాయంకాలం పద్మాలు ముడుచుకు పోకుండా ఎవరు ఆపగలరు?]

సంపుటి 65 అగస్టు '79 సంచిక 2

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00

CHITRA




బి. వెంకటేశ్వరరావు, వాయుడుపేట (ఆంధ్ర)

ప్ర: పుట్టుగుడ్డివానికి బ్రతుకే చీకటిగా ఉంటుంది గదా, మరి వానికి కలలు వస్తాయంటారా? కనీసం కలలోనైనా ప్రకృతిసౌందర్యం తిలకించుటకు అవకాశం ఉంటుందా?

న: పుట్టుగుడ్డివారికి సైతం కలలు వస్తాయి. వారి కలల్లో దృశ్యాలు (కంటికి కనిపించేవి) ఉండవు. ధ్వని, రుచి, స్పర్శ మొదలైన దృష్టేతరఇంద్రియానుభూతులతో కూడిన కలలు వారికి వస్తాయి. కలల్లో ప్రకృతిసౌందర్యాన్ని తిలకించే అవకాశం పుట్టుగుడ్డివారికి వుంటుందని భావించలేము. పుట్టుగుడ్డివారు కలల్లో "చూసి" నట్లుగ చెప్పిన వుదంతాలు అరుదు. ఒకవేళ చెప్పినా, వారి దృష్టి భావనని మామూలు చూపుతో పోల్చలేము.

సాధారణంగా కల గనేటప్పుడు దృష్టి సరిగా ఉన్నవారి కళ్ళు వేగంగా కదులుతాయి (Spasmodic, conjugate, rapid eye movements). అలాంటి కదలికలు కొందరు పుట్టుగుడ్డివారిలో కూడా గమనించబడ్డాయి. అయితే, దృష్టి మామూలుగా ఉన్నవారి కళ్ళ కదలికకీ, పుట్టుగుడ్డివారి కళ్ళ కదలికకీ చాలా తేడా వుంది. "ఎలెక్ట్రో ఆక్యులోగ్రామ్" (Electro oculogram) అనే యంత్రంతో రికార్డు చేయబడే "కార్నియో ఫండల్ పొటెన్షియల్స్" (Corneo fundal potentials) అనేవి పుట్టుగుడ్డి వారిలో లేకపోవటంగానీ, చాలా తక్కువగా వుండటంగానీ జరుగుతుంది. పుట్టుగుడ్డి వారిలో చూపుకు సంబంధించిన ఏ భాగాలు దెబ్బ తిన్నాయన్నదానికీ, కళ్ళు కదలికకీ కూడా చాలా సంబంధం వుంది. కొంతకాలం దృష్టి సరిగా వుండి, గుడ్డితనం ఏర్పడిన వారి కలల్లో దృశ్యాలు వుంటాయి. వయసు పెరిగి, ముసలితనం సమీపిస్తున్న కొద్దీ వారి కలల్లో దృశ్యాలు బాగా తగ్గిపోతాయి.

కళ్ళ కదలికకూ, కలల్లో చూడటానికీ కొంతవరకు సంబంధం వున్నదని చెప్పవచ్చు.

[చందమామ పాఠకులకు ఈ సమాధానం అందజేసినవారు శ్రీ పి. వి. కృష్ణారావు, లెక్చరర్, సైకాలజీ & పారాసైకాలజీ శాఖ, ఆంధ్ర యూనివర్సిటీ, వాల్తేరు.]




## 74

“మిత్రమా, ఇలా నిలబడి ఉంటే తిండీ, దాహమూ బాధించవా? కొద్ది రోజులలో ప్రాణాలు పోవా?” అని అత్యంత లోభి అడిగాడు.

“అలా జరగదు. దురాశాపరులు నిధులు కొల్లగొట్టుకుపోకుండా హడలగొట్టటానికి కుబేరుడు ఈ ఏర్పాటు చేశాడు. చక్రం నెత్తి మీద తిరుగుతున్నంతసేపూ ఆకలి దప్పులూ, జరా మరణాలూ ఉండవు. కాని దుర్భరమైన బాధ మాత్రం ఉంటుంది. మరి నేను సెలవు పుచ్చుకుంటాను,” అన్నాడు ఆ మనిషి.

“ఇంత కాలం గడిచాక నీకు ఇల్లు ఎక్కడ? నీ వాళ్ళంతా ఎప్పుడో పోయి ఉంటారు. ఎక్కడికి పోతావు?” అని అత్యంత లోభి అడిగాడు.

“నేనామాట ఆలోచించలేదు సుమా! అయితేనేం? ప్రపంచం విశాలమైనది. జీవితం మధురమైనది. యుగాలు మారి, అయినవాళ్ళు అందరూ పోయినా కొత్త జీవితం ప్రారంభించవచ్చు,” అంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు.

ఈ లోపల అతిలోభి బంగారునిధి వద్ద అత్యంతలోభి కోసం చాలా కాలం చూసి, అతను ఎంతకూ రాకపోయేసరికి, నిధి నుంచి అయిదువేల నాణాలు తీసుకుని, అత్యంతలోభి కోసం వెతుక్కుంటూ బయలుదేరి వెళ్ళి చిట్ట చివరకు అతన్నీ, అతని నెత్తిని మధిస్తున్న చక్రాన్నీ చూశాడు.

అత్యంతలోభి శరీరంమీదా, ముఖం మీదా ఎడతెరిపి లేకుండా భయంకరంగా రక్తం పారుతున్నది.



నువు కూడా నా హితవు విన్నావు కావు.'' అన్నాడు.

''ఏమిటా కథ?'' అని అత్యంతలోభి అడిగితే, అతిలోభి ఇలా చెప్పసాగాడు:

మంథరకుడి కథ

ఒకానొక గ్రామంలో మంథరకుడు అనే సాలెవాడు ఉండేవాడు. ఒకనాడు అతని మగ్గం శీలలు విరిగిపోతే, మగ్గాన్ని మరమ్మతు చేసుకునేటందుకు కర్ర కోసం గొడ్డలి తీసుకుని బయలుదేరాడు. వాడికి సముద్రతీరాన పెద్ద చెట్టు కనబడింది. ఆ చెట్టును నరికి ఎన్ని శీలలైనా చేసుకోవచ్చు గదా అని వాడు అనుకున్నాడు.

అయితే ఆ చెట్టులో నివసిస్తున్న దేవత వాడితో, ''బాబూ, ఈ చెట్టు జోలికి రాకు. ఇది నా నివాసం. సముద్రపు గాలి పీల్చుతూ, ఇందులో ప్రశాంతంగా ఉంటున్నాను,'' అన్నది.

''నన్ను మాత్రం ఏం చెయ్యమన్నావు? నా మగ్గం బాగు చేసుకోకపోతే నాకు తిండి ఉండదు,'' అన్నాడు సాలెవాడు.

''అయితే ఒకటి చేద్దాం! నువు ఈ చెట్టు జోలికి రాకుండా ఉంటే నేను నువు కోరినది ఇస్తాను,'' అన్నది వృక్ష దేవత.

''అలాగే కానీ. నేను ఇంటికి వెళ్లి, నిన్ను ఏం కోరాలో నా భార్యనూ, మిత్రుణ్ణీ

తన మిత్రుణ్ణి అలాటి స్థితిలో చూసేసరికి అతిలోభికి కళ్ళ వెంట నీరు వచ్చింది. అతను అత్యంతలోభిని సమీపించి ''మిత్రమా, ఏమిటిది?'' అని అడిగాడు.

''విధిలిఖితం,'' అన్నాడు అత్యంతలోభి.

''ఎలా జరిగింది?'' అని అతిలోభి అడిగాడు. అత్యంతలోభి తన కథ అంతా చెప్పాడు.

అంతా విని అతిలోభి, ''మిత్రమా, దురాశతో ఈ దశకు వచ్చావు. వెనకటికి మందరకుడు అనే సాలెవాడు మంగలి చెప్పిన మంచి మాట విననట్టుగానే,

అడిగి వస్తాను,'' అని సాలెవాడు నగరానికి తిరిగి వచ్చి, తన మిత్రుడైన మంగలిని కలుసుకుని, వాడి సలహా అడిగాడు. ''ఏలటానికి ఒక రాజ్యం కోరుకో. నేను నీకు మంత్రిగా ఉంటాను. ఇద్దరమూ సుఖంగా ఉందాం,'' అన్నాడు మంగలి.

''నా భార్య ఏమంటుందో అడిగి చూస్తాను,'' అన్నాడు సాలె.

''వద్దు! ఆడదానికి నీ చిత్తం వచ్చినంత తిండిపెట్టు, నగలు ఇయ్యి, బట్టలు ఇయ్యి—ఆలోచన మాత్రం అడగకు,'' అన్నాడు మంగలి.

''కాదులే! దాన్ని కూడా అడగాలి,'' అని సాలె, తన భార్యను కలుసుకుని, ఆమె సలహా అడిగాడు. అంతేగాక తనకు మంగలి ఏలటానికి రాజ్యం కోరుకోమని సలహా ఇచ్చాడని కూడా చెప్పాడు.

''మంగలి మాట ఎన్నడూ వినకు. క్షౌరం చెయ్యటం తప్పిస్తే వాళ్ళకేం తెలును? రాజులంటే ఏమిటో, రాజ్యాలంటే ఏమిటో, వాళ్ళకు తెలుసునా ఏం? రాజ్యం చెయ్యటమంటే మాటలా? యుద్ధమూ, సంధీ, రాయబారాలూ, ఇంకా ఏమేమిటో వచ్చిపడి, నానా బాధలూ కలుగుతాయి. రాజ్యం కోసం రాజు ప్రాణాలకు వాడి తమ్ములే, వాడి కొడుకులే ఎసరు పెడతారు!'' అన్నది సాలెవాడి భార్య.



''నీ మాట నిజం. ఇంతకూ ఏం అడగమంటావు?'' అని సాలె తన భార్యను అడిగాడు.

''నీకున్న రెండు చేతులూ, ఒక తలా ఉపయోగించి రోజుకు ఒక బట్ట నేస్తున్నావు. దానితో మనకు జరుగుబాటు అవుతున్నది. నీకు మరి రెండు చేతులూ, మరొక తలా కావాలని దేవతను అడుగు. వాటితో రెండు బట్టలు నేస్తావు. ఒకటి ఖర్చు గడవటానికి, రెండోది వినోదించటానికి ఉపయోగపడతాయి,'' అన్నది సాలెవాడి భార్య.

"భేష్!" అని సాలెవాడు చెట్టువద్దకు వెళ్ళి, తన భార్య దేవతను కోరమన్నట్లే అదనంగా రెండు చేతులూ, తలా కోరాడు.

దేవత అలాగే అని వాడికోరిక తీర్చింది.

అయితే వాడు రెండు తలలతోనూ, నాలుగు చేతులతోనూ ఇంటికి తిరిగి వస్తూండగా, జనం వాణ్ణి చూసి భూతం అనుకుని కర్రలతోనూ, రాళ్ళతోనూ కొట్టి చంపేశారు.

అతిలోభి అత్యంత లోభికి ఈ కథ చెప్పి, ఇంకా ఇలా అన్నాడు:

"బంగారం నీకు చాలలేదు. వజ్రాలూ, వైడూర్యాలూ కోరావు. ఏమయింది? చక్రం నీ నెత్తిన తిరుగుతూ, కెంపుల కన్న ఎర్రనైన రక్తబిందువులను చుట్టూ చిమ్ముతున్నది. నువు కోరిన వజ్రాలకన్న మెరిసిపోయే కన్నీటి చుక్కలను నీకళ్లు రాల్చుతున్నాయి. మిత్రమా, బంగారం కన్న రత్నాలు విలువైనవని తెలిసినంత మాత్రాన అది జ్ఞానం కాదు, రాబోయే చిక్కులనూ, కలుగబోయే ఫలితాలనూ ముందే గ్రహించే తెలివి కూడా ఉండాలి. అలా కానప్పుడు, ఎంతటి మేధావి అయిన కులీనుడు సైతం ప్రమాదానికి గురి అవుతాడు. లోకజ్ఞానం అన్నిటికన్నా ముఖ్యం. అది లేకపోతే, సింహాన్ని బతికించిన పండితులలాగా నశిస్తాడు.''

''ఏమిటా కథ?'' అని అత్యంతలోభి అడిగితే, అతిలోభి పండితులకథ ఇలా చెప్పాడు:





# భల్లూకమాంత్రికుడు

## 14

[భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా మాయామర్కటాన్ని తరుముతూ కోట దగ్గిరకు వచ్చారు. కోటలోపల జరుగుతున్న యుద్ధాన్ని గురించి తలారి భల్లూకుడు వాళ్ళకు చెప్పాడు. జితకేతుడి మంత్రి జీవగుప్తుడు అక్కడికి వచ్చి, ఒక సైనికుణ్ణి కాళీవర్మ దగ్గిరకు పంపాడు. దొంగ నాగమల్లూ, అతడి అనుచరులూ కోటద్వారాలకు నిప్పుపెట్టారు. తరవాత—]

**కో**ట ద్వారాలు ఉవ్వెత్తున లేచిన మంటల్లో కాలి, కూలిపోవటం చూస్తూనే తలారి భల్లూకుడు పరుగున పోయి మొండి తొండపు ఏనుగు నెక్కి, "కాళీవర్మదొరా! ఇక మనం కోటలో ప్రవేశిద్దాం. అక్కడ మనకు మర్కట రూపంలో వచ్చినవాడు దొరక్కపోడు." అని యింకా మండుతున్న ఎండుకట్టెలు చేత బట్టి గంతులు వేస్తున్న ఆటవికుడితో, "ఒరే, ఆటవిక సేవకా! త్వరగా వచ్చి ఏనుగును కోటలోకి నడుపు." అన్నాడు.

ఆటవికుడు మండుతున్న కట్టెను దూరంగా విసిరివేసి దొంగల నాయకుడు నాగమల్లును హెచ్చరించి, "ఇదె వచ్చె, భల్లూకయ్యా!" అంటూ ఏనుగు కేసి బయలుదేరబోయేంతలో, నాగమల్లు అతణ్ణి ఆపి, "ఇక్కడ నాకూ, నా తోటి వాళ్ళిద్దరికీ ఏం పని? ఇదంతా ఏదో



మాంత్రికుల మధ్య తగూలాటగా వున్నది. మా దారిన మేం అరణ్యానికి పోయి, మా వృత్తేదో మేం తిరిగి ప్రారంభిస్తాం,'' అన్నాడు.

కోటద్వారాలను సమీపిస్తూ ఆ మాటలు విన్న కాళీవర్మ కోపంగా నాగమల్లు మీదికి కత్తి దూసి, ''ఒరే, ఆఖరిక్షణంలో నీ దారులుకొట్టుకు బతికేబుద్ధి పోనిచ్చావు కాదు. మాటుపెట్టి, నిరాయుధులైన ప్రయాణీకుల్ని దోచుకోవటం తప్ప, ఎదిరించి నిలబడి శత్రువులతో పోరాడే ధైర్యసాహసాలు నీకు లేవా? '' అన్నాడు.

దొంగ నాగమల్లు అందరి కేసీ ఓమారు యీసడిస్తున్నట్టు చూసి, ''పుట్టుదొంగనైన నాకు శత్రువు లెవరు? మిత్రు లెవరు? బతుకు తెరువుకు యింత ధనం ఎవరిదగ్గిర దొరికేలావుంటే, వాళ్ళను దోచుకుంటాను. ఇప్పుడు కోటలో దుర్ముఖ రాజు గెలిచినా లేక అతడి పాత సామంతుడు సూర్యభూపతి గెలిచినా, నాకు ఒరిగేదేమిటి? '' అన్నాడు.

నాగమల్లు తమ పక్షాన వుండేందుకు జీతం డబ్బులకోసం యిలా డొంక తిరుగుడుగా అడుగుతున్నాడని గ్రహించిన భల్లూక మాంత్రికుడు కత్తితో అతడి భుజాన్నితాకి, ''ఒరే, నాగమల్లూ! ఇది అంతగా మంత్రశక్తులు లేని కత్తి అయిపోయిందిగాని, యిదే మంత్రదండం అయివుంటే నిన్ను, యీ క్షణాన గుంటనక్కగా మార్చి వుండేవాణ్ణి. రాజు దుర్ముఖుడు కాక యిప్పుడు ఎవరు గెలిచినా, నిన్ను అరణ్యంలో క్రూర మృగం కింద వేటాడేస్తారు. ఆ సంగతి గ్రహించ లేవా? '' అన్నాడు.

ఆ మరుక్షణం నాగమల్లుకు తాను రాజు దుర్ముఖుడి పక్షానవుండటం మేలనిపించింది. అతడి రక్షణకోసం మాంత్రికులలాంటి వాళ్ళూ, రాక్షసుడూ పూనుకున్నప్పుడు, ఆ రాజు తప్పక తిరిగి ఉదయగిరి రాజ్యానికి రాజు కాగలడన్న నమ్మకం అతడికి కలిగింది.

నాగమల్లు తన అనుచరు లిద్దరి కేసీ తిరిగి, "ఒరే, యీనాటితో మనకు చెట్టూ చేమలూ పట్టుకు తిరిగే బాధ తప్పింది. దుర్ముఖరాజు పక్షాన చేరి శత్రుసంహారం చేశామంటే, ఆయన మనకు సైన్యంలో పెద్ద జీతం మీద పదవులివ్వకపోడు," అన్నాడు.

తమ నాయకుడు యిలా అనగానే దొంగలిద్దరూ కత్తులు పైకెత్తి, "దుర్ముఖ మహారాజుకూ, జై!" అంటూ ఒకసారి కేకపెట్టి, మండుతున్న కోటద్వారపు కొయ్య ముక్కల్ని కత్తులతో పక్కలకు నెట్టుతూ, లోపలికి పోయేందుకు దారి చేయసాగారు.

భల్లూక మాంత్రికుడూ, కాళీవర్మా తమ వాహనాలెక్కి, తలారి భల్లూకుడూ వాళ్లతో, "మనమంతాకలిసి పదిమందికి మించిలేము. మనం ముఖ్యంగా చేయవలసింది మాయామర్కట రూపంలో వున్నవాడి నుంచి మంత్ర దండాన్ని లాక్కోవటం, తరవాత దుర్ముఖరాజు ప్రాణాలు కాపాడటం. అందుకు మీలో ప్రతి ఒక్కరూ మంచిసాహసం, తెగింపూ చూపవలసి వుంటుంది," అన్నారు.

అందరూ ఆయుధాలెత్తి, యీసారి, "కాళీవర్మకూ, జై!" అంటూ కేక పెట్టారు.




కాళీవర్మ గుర్రం మీద ముందుండి కోటలోపలికి దారితీస్తూ, చప్పున ఏదో గుర్తు వచ్చినవాడిలా గుర్రాన్ని వెనక్కు తిప్పి, "ఆ ఉగ్రదండు డనే రాక్షసు డెక్కడ?" అన్నాడు.

ఆ సమయంలో ఉగ్రదండుడు ఒక ఏనుగు తొండం పట్టుకుని వెంట నడుపుతూ, దూరంగా నిలబడివున్న రాజు జితకేతుడి మంత్రి జీవగుప్తుడి కేసి పోతున్నాడు. అది చూస్తూనే కాళీవర్మ ఆశ్చర్యపడిపోతూ, భల్లూక మాంత్రికుడితో, "గురూ, చూడగా యీ రాక్షసుడు మన శత్రువైన జితకేతుడి పక్షాన చేరేందుకు పోతున్నట్టున్నది," అన్నాడు.



"అలా అయుండదు. వాడికి నాతో ఏదో పనివున్నట్టు తెలిసింది. వెంటనే పోయి మంచి మాటలతో సంగతేమిటో తెలుసుకో," అన్నాడు భల్లూక మాంత్రికుడు.

ఈ మాటలు వింటూనే తలారి భల్లూకుడు, మరొక ఏనుగుమీదవున్న దుర్ముఖుడి అంగరక్షకులతో, "ఒరే, అంగరక్షక భటులారా! ఆ రాక్షసుడు కాళీవర్మదొర మీద తిరగబడతాడేమో, ఎందుకైనా మంచిది, మనం ఏనుగులతో ఆయన వెన్నుకాస్తూపోదాం," అంటూ అటవికుడిని ఆజ్ఞాపించి, ఏనుగును కాళీవర్మ గుర్రం వెనకగా నడిపించాడు.

గుర్రం మీద కాళీవర్మా, ఏనుగుల మీద తలారిభల్లూకుడూ, అంగరక్షకులూ తన కేసి రావటం చూస్తూనే రాక్షసుడు ఉగ్రదండుడు ఒక క్షణకాలం ఆశ్చర్య పోయి, ఎందుకైనా మంచిదన్నట్టుగా రాతిగదను కుడిచేత్తో పైకెత్తి పట్టుకుని, ఏనుగును తొండం పట్టుకుని లాగి, వాళ్ళ కేసి తిప్పి, నిలబడ్డాడు.

కాళీవర్మ, ఉగ్రదండుణ్ణి సమీపిస్తూనే, "ఉగ్రదండా, ఏమిటిది? మాతోపాటు కోటలోకి వచ్చి, సామంతు సూర్య భూపతి నుంచి రాజు దుర్ముఖుణ్ణి రక్షిస్తా వనుకున్నామే," అన్నాడు.

"కాళీవర్మా, రాజు దుర్ముఖుడు యింకా బతికేవుంటాడనేనా, నీ నమ్మకం?" అని అడిగాడు రాక్షసుడు ఉగ్రదండుడు.

"అతడు ప్రాణాలు కోల్పోయి వుంటా డని, నీ కెందుకు అనుమానం కలిగింది? కోటలో అతడి పక్షాన కొందరు సైనికు లున్నట్టు తెలయటం లేదా? అలా కాకపోతే, ఆ వినిపిస్తున్న యుద్ధం గొడ వంతా ఎవరిమధ్య జరుగుతున్నట్టు?" అన్నాడు కాళీవర్మ.

రాక్షసుడు ఉగ్రదండుడు, దూరంగా వున్న మంత్రి జీవగుప్తుడి సైనికుల కేసి చేయి చూపుతూ, "కాళీవర్మా, మీరంతా కోటద్వారాల ముందు ఉబుసుపోని



కబుర్లతో కాలయాపన చేశారు. ఇప్పటి కైనా మించిపోయింది లేదు. త్వరగా కోటలోకి జొరబడి రాజు దుర్ముఖుణ్ణి రక్షించటంతోపాటు, ఆ మాయామర్కటం నుంచి మంత్రదండాన్ని కూడా సంపాయించండి.'' అన్నాడు.

''ఆ పనే చేయబోతున్నాం. మరి, యీ ఏనుగును వెంటబెట్టుకుని నీ ప్రయాణం ఎక్కడికి?'' అని అడిగాడు కాళీవర్మ.

రాక్షసుడు ఉగ్రదండుడు రాతిగదను జీవగుప్తుడూ వాళ్ళ కేసి ఊపుతూ, ''ఆ మంత్రి, అతడి వెంటవున్న సైనికులూ కోటలోపల మిమ్మల్ని వెనకపాటుగావచ్చి హతం చేయకుండా, వాళ్ళ దారిని అడ్డుతున్నాను.'' అన్నాడు విసుగ్గా.

ఆ మాటలతో తృప్తిపడి కాళీవర్మ, తలారిభల్లూకుడూ వాళ్ళతో తిరిగి కోట ద్వారం దగ్గిరకు వచ్చాడు. తరవాత అందరూ భీకరంగా అరుస్తూ కోటలో ప్రవేశించారు. రెండు ఏనుగుల మీద కత్తులూ, గండ్రగొడ్డలీ పట్టినవాళ్ళూ; గుర్రం మీద కాళీవర్మా, ఎనుబోతు మీద భల్లూక మాంత్రికుడూ, వాళ్ళ వెనకగా నానాహంగామా చేస్తూ దొంగనాగమల్లూ, అతడి అనుచరులూ లోపలికి రావటం చూస్తూనే అంతవరకూ సామంతుడి పక్షాన, రాజు దుర్ముఖుడి సైనికులతో పోరాడుతున్నవాళ్ళు భయకంపితులై పోయి, ''సూర్యభూపతి మహారాజా! భల్లూక మాంత్రికుడు ఏనుగుల మందతో వస్తున్నాడు. ప్రస్తుతానికి పారిపోవటం క్షేమం!'' అంటూ కేకలు పెట్టారు.

ఆ వెంటనే ఒక చిన్న కట్టడం వెనక నుంచి సామంతు సూర్యభూపతి గుర్రం మీద, నెత్తురోడుతున్న కత్తితో చప్పున ముందుకు వచ్చి, ''ఒరే, మీరు భయ పడకండి! దుర్ముఖుడి పక్షం చేరిన వాళ్ల నందర్నీ దాదాపు హతమార్చాం. ఈ భల్లూక మాంత్రికుడు మనను ఏం చేయ గలడు? మర్కట రూపంలో మన పక్షాన



వున్నవాడు. భల్లూకమాంత్రికుణ్ణి మించిన మంత్రశక్తులున్నవాడు." అంటూ కేక పెట్టాడు.

సామంతుణ్ణి చూస్తూనే కాళీవర్మ గట్టిగా పళ్ళు కొరికి, "ఒరే, సామంతూ! కోతులసాయంతో యుద్ధాలు గెలవాలని చూస్తున్నావా? రాజు దుర్ముఖు డెక్కడ? అతడి చేతే స్వయంగా నీ తల నరికించబోతున్నాను." అన్నాడు.

అంతలో కట్టడం పిట్ట గోడమీదికి మాయామర్కటం ఛెంగుమని దూకుతూ కిచకిచమంటూ అరిచింది. అందరూ తలలెత్తి దానికేసి చూశారు. మర్కటం కుడిచేతిలో మంత్రదండం వున్నది. అది తన ఎడమచేతిలో ఒక తలను జుట్టు పట్టుకుని వేలాడిస్తూ, "ఓయ్ఁ, కాళీవర్మా! రాజు దుర్ముఖుడు ఎక్కడున్నాడని అడిగావు కాదా? ఇదుగో, అతడి తెగిన తల! మొండెం ఎక్కడున్నదో నువు వెతికి కనుక్కునే లోపల, నీ తల కూడా యిలాగే రాజు సూర్యభూపతి కత్తి దెబ్బకు తెగి నేలపడుతుంది," అన్నది.

ఆ వెంటనే భల్లూక మాంత్రికుడు కత్తి దూసి, ఎనుబోతు వాహనాన్ని ముందుకు నడుపుతూ, "ఒరే, మర్కట రూపంలో వున్న దుష్టుడా, భ్రాంతిమతీ! నా మంత్ర దండాన్ని దొంగిలించ గలిగానని సంతోషించకు. ఈ ఖడ్గం దానికేమీ తీసిపోదు. నీ గురువు తాంత్రిక మిథ్యామిశ్రుడు కూడా, ఆ బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలు వదిలి, యీ అరణ్యప్రదేశాలు తిరుగుతున్నాడా?" అన్నాడు.

ఆ మాటలకు మాయామర్కటం హేళనగా కచుమంటూ పెద్దగా అరిచి, "ఏయ్, భల్లూక మాంత్రికా! నా గురువు ఎక్కడవున్నదీ, నీ మంత్రశక్తితో ఏ అంజనమో వేసి తెలుసుకోలేవా? బహుశా ఆయన నీ గురువైన భల్లూకపాదుడి తల నరికేందుకు, మంచు రాళ్ళమీద కత్తికి పదును పెడుతూంటాడు," అన్నాడు.



భల్లూక మాంత్రికుడు పట్టరాని కోపంతో కసిగా పళ్ళుకొరికి, "శిష్యా, కాళీవర్మా! తలారిభల్లూకా! ఈ కోట ద్వారం దగ్గిర సరిఅయిన కాపుపెట్టండి. ఈ మాయా మర్కటుడినీ, సామంతుణ్ణీ ప్రాణాలతో పట్టుకుని చిత్రవధ చేస్తాను." అన్నాడు.

మాంత్రికుడు మాట ముగించేలోపలే తలారిభల్లూకుడి ఏనుగుమీదవున్న ఆట వికుడు వదిలినబాణం రివ్వుమంటూ పోయి, మాయామర్కటం తెగిన తలను పట్టుకునివున్న చేతికి తగిలింది. బాణం దెబ్బ తింటూనే మర్కటం బాధతో పెద్దగా అరవటంతోపాటు, దాని చేతిలో వున్న శిరస్సు జారి అంత ఎత్తునుంచి దభీమంటూ కిందపడింది.

శిరస్సు నేలపడగానే మరొక ఏనుగు మీదవున్న రాజు దుర్ముఖుడి అంగరక్షకు లిద్దరూ కిందికి దూకి, పరుగునపోయి శిరస్సు కేసి చూస్తూనే, "ఇది దుర్ముఖ మహారాజు తల కాదు. ఆ మాయకోతి మనను మోసం చేయ చూసింది." అన్నారు.

ఆ వెంటనే తలారిభల్లూకుడు, "దిరిశెనవన, భైరవా!" అంటూ కేక పెట్టి, గండ్రగొడ్డలి పైకెత్తి, "ఒరే, ఆటవిక సేవకా! మాయామర్కటాన్ని కొట్టి అద్భుతమైన పని చేశావు. ఆ దుర్ముఖ రాజు కోసం మనం కోట అంతా గాలించ బోతున్నాం. నా గండ్రగొడ్డలికి అందని వాళ్ళను, నీ బాణాలతో పరలోకానికి ప్రయాణం కట్టించు." అంటూ ఏనుగు తల మీద గొడ్డలిపిడితో గట్టిగా పొడిచాడు.

ఏనుగు పెద్దగా ఘీంకరిస్తూ కదిలింది. ఈ లోపల మాయామర్కటం పిట్టగోడ మీది నుంచి కనబడకుండా పోవటంతో, కాళీవర్మ, భల్లూక మాంత్రికుడితో, "గురూ, ముందు మనం సామంతుణ్ణీ, వాడి సైనికులనూ తరిమికొట్టాలి. రాజు దుర్ముఖుడు యీ కోటలో ఏదో ఒక ప్రాంతాన ప్రాణాలతో వున్నాడనే నా నమ్మకం." అన్నాడు.

''భల్లూకపాదగురో!'' అంటూ భల్లూక మాంత్రికుడు కత్తి పైకెత్తి, ''ఒరే, రాజు దుర్ముఖుడి పక్షాన నిలబడే సైనికులంతా మా వెంట రండి. ఎదురు తిరిగిన వాళ్ళను నా కత్తికి బలి చేస్తాను,'' అంటూ పెద్దగా కేక పెట్టాడు.

అప్పటివరకూ సామంతుడి పక్ష సైనికుల ధాటికి తట్టుకోలేక కోటలో అక్కడా, యిక్కడా దాగి వున్న రాజు దుర్ముఖుడి సైనికులు బిలబిలమంటూ మాంత్రికుడున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''అయ్యా, రాజుగారు శత్రుబలానికి జంకి సభామంటపంలోని సింహాసనం వున్న గదిలో దాగి వున్నారు,'' అని చెప్పారు.

''అయితే ముందుండి దారి తీయండి, మీ కొచ్చిన ప్రాణ భయం ఏమీ లేదు. శత్రుసైనికుల సంగతి మేం చూస్తాం,'' అన్నాడు కాళీవర్మ.

కాళీవర్మా, భల్లూకమాంత్రికుడూ సభామంటపానికి వెళ్ళే దారిలో ఒక్కగా నొక్క శత్రువైనా కంటబడలేదు. వాళ్ళు కోటలో మరొక భాగానచేరి సామంతుడూ, మాయామర్కటాలతో యిప్పుడేమి చేయటమా అని ఆలోచిస్తున్నారు.

కాళీవర్మా, మాంత్రికుడూ సభామంటపాన్ని సమీపిస్తున్నంతలో తలారిభల్లూకుడు ఏనుగు మీద అక్కడికి వచ్చాడు. ఆ మరుక్షణం మంటపంలో సింహాసనం వున్న గది తలుపులు బార్లా తెరుచుకున్నవి. రాజు దుర్ముఖుడు సింహాసనం మీద కూర్చుని వున్నాడు.

కాళీవర్మతోపాటు అందరూ ఆశ్చర్యపోయి చూసేంతలో రాజు దుర్ముఖుడు చేయెత్తి, ''తలారిభల్లూకా! తిరిగి కొద్దిసేపైనా సింహాసనం మీద కూర్చోవాలనే, నా కోర్కె తీరింది. ఇప్పుడు నిరభ్యంతరంగా నా తల నరికి, నీ గురువుకు సమర్పించుకో!'' అన్నాడు.

ఆ వెంటనే తలారిభల్లూకుడు ఉత్సాహంగా ఒక కేకపెట్టి, గండ్రగొడ్డలి పైకెత్తి, ఏనుగు మీది నుంచి సభామంటపంలోకి ఎగిరిదూకాడు. —(ఇంకా వుంది)






# దివ్యజ్ఞానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, మనుషులు అజ్ఞానులు కావటమేగాక, వాళ్లు పరిపూర్ణ జ్ఞానాన్ని గౌరవించలేరు. అందుకు నిదర్శనంగా దివ్యజ్ఞానికి జరిగిన అన్యాయం గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

దివాకరు డనే రాజు కాంచనపురాన్ని పరిపాలిస్తూండగా, ఆ నగరానికి ఒక సాధువు వచ్చి, నగరం వెలపల ఉన్న వనంలో ఒక కుటీరం నిర్మించుకున్నాడు. ఆ సంగతి తెలిసి నగరపౌరులు ఆయనను చూడబోయి ఆయనతో తమ కష్టసుఖాలు చెప్పుకుని, ఆయన సలహా కోరారు. ఆయన ప్రతి ఒక్కరికీ వాళ్ళ కష్టాలు

## బేతాళ కథలు



ఎలా, ఎప్పుడు తొలగిపోతాయో, అసలు పోతాయో, పోవో, వాళ్ళ ప్రయత్నాలు ఫలిస్తాయో, ఫలించవో చూసినట్లు చెబుతూ వచ్చాడు.

దివ్యజ్ఞాని గురించి రాజు దాకా వెళ్లింది. ఆయనకు విధిలో పూర్తి విశ్వాసం ఉన్నది. ప్రతి ఒక్కరికీ రాసిపెట్టి ఉన్నట్టే జరుగుతుంది. దాన్ని తప్పించటం ఎవరితరమూ కాదు. అలాటప్పుడు ఈ దివ్యజ్ఞాని లాటివాడు జరగబోయేది తెలుసుకోగలిగినంత మాత్రాన అది జరగటం మానదుగదా!

కాని దివాకరుడి మంత్రి సుదర్శనుడికి భవిష్యత్తు తెలియటం వల్ల లాభం ఉండవచ్చుననిపించింది. సుదర్శనుడి కొడుకు పుట్టినది లగాయతు రోగిష్ఠిగా ఉంటున్నాడు. వైద్యులు వాణ్ణి బాగు చెయ్యలేకపోయారు. దివ్యజ్ఞాని ఏమైనా సహాయపడగలడేమోనని ఆయన ఆశ పడ్డాడు. మంత్రి చెప్పినది విని, దివ్యజ్ఞాని, "నీ కొడుక్కు గ్రహదోషం ఉన్నది. నేను చెప్పిన విధంగా శాంతి జరిపించు, కుర్రవాడు ఆరోగ్యవంతుడవుతాడు," అన్నాడు.

ఆయన చెప్పినట్టే సుదర్శనుడు శాంతి జరిపించేసరికి, అతని కొడుకు నెల రోజులలో సంపూర్ణారోగ్యం పొందాడు. సుదర్శనుడు దివ్యజ్ఞానికి అంతులేని కట్నాలూ, కానుకలూ తీసుకుపోయాడు.

"అన్నీ విడిచిపెట్టినవాడికి ఈ బహుమతులు దేనికి, నాయనా? నాకేమీ వద్దు," అని దివ్యజ్ఞాని వాటిని నిరాకరిస్తూ, మంత్రికి ఒక ఔషధాన్ని ఇచ్చి, ఎవరినైనా నాగుపాము కరిస్తే, వారికి ఆ ఔషధం వేసి బతికించవచ్చునని చెప్పాడు.

పాము గండం ఎవరికి ఉంటుందో అనుకుంటూ మంత్రి ఇంటికి వెళ్ళాడు. మర్నాడు ఉదయం మసక వెలుతురులో ఆయన తన ఇంటినుంచి బయటికి వస్తూ, నాగుపామును తొక్కి, కాటు

తిన్నాడు. దివ్యజ్ఞాని ఇచ్చిన ఔషధం అతని ప్రాణాన్ని కాపాడింది.

ఇది తెలిసిన మీదట రాజుకు దివ్యజ్ఞాని గురించి ఆసక్తి కలిగింది. ఆయన భవిష్యత్తును తెలుసుకోవటమేగాక, మార్చను కూడా గలడా ? ఈ అనుమానాన్ని తీర్చుకోదలచుకుని దివాకరుడు ఒకసారి వేటకు బయలుదేరిపోతూ, దారిలో దివ్యజ్ఞాని కుటీరం దగ్గిర ఆగి, ఆయన దర్శనం చేసుకుని, '' స్వామీ, వేటాడబోతున్నాను. వేట ఎలా సాగుతుంది ? '' అని అడిగాడు.

'' ఇవాళ నువు ఒక్క జంతువును కూడా కొట్టలేవు,'' అన్నాడు దివ్యజ్ఞాని.

రాజు వేటలో సిద్ధహస్తుడు. వేటకు పోయి అనేక జంతువులను కొట్టకుండా ఆయన ఏనాడూ తిరిగి రాలేదు. "ఈ దివ్యజ్ఞానికి భవిష్యత్తు కూడా అంత బాగా తెలిదులాగుంది," అనుకుంటూ ఆయన అరణ్యంలోకి వెళ్ళాడు. అయితే, దివ్యజ్ఞాని చెప్పినది అక్షరాలా నిజమయింది. ఆ రోజు రాజుకు ఒక చిన్న చెవులపిల్లి కూడా అందలేదు.

ఇది జరిగిన కొద్ది రోజులకే దివాకరుడికి పొరుగు రాజుతో యుద్ధం దాపురించింది. పొరుగు రాజు బలవంతుడు. దివ్యజ్ఞాని సలహా తీసుకుందామని రాజు వెళ్ళి అడిగితే, దివ్యజ్ఞాని, '' యుద్ధం




చెయ్యి, నాయనా! నీకు జయం తేలికగా లభిస్తుంది.'' అన్నాడు.

ఈసారి కూడా దివ్యజ్ఞాని జోస్యం అక్షరాలా నిజమయింది. బలవంతుడినన్న అహంకారంవల్లనో ఏమో, పొరుగు రాజు వ్యూహ రచన అశ్రద్ధగా చేసి, కొద్ది ఘడియలలో చావు దెబ్బ తిని, పారిపోయాడు.

తరవాత రాజుకూ, మంత్రికీ దివ్యజ్ఞాని గురించి చర్చ జరిగింది.

'' దివ్యజ్ఞానికి భవిష్యత్తు తెలుసును. దాన్ని మార్చే శక్తి ఆయనకు లేదు. నీ కొడుకును ఆరోగ్యవంతుణ్ణి చేశాడనీ, నిన్ను పాముగండం నుంచి కాపాడాడు గనక ఆయనకు భవిష్యత్తును మార్చే



శక్తి ఉన్నదమకుంటున్నావు. కాని అనేక మందికి రోగాలు నయం కావనీ, అపజయాలు తప్పవనీ ఆయన చెబుతున్నట్టు నాకు తెలుసు. నీ కొడుకు ఆరోగ్యం బాగుపడబోతుందనీ, పాము కాటు వల్ల నీకు ప్రాణ హాని లేదనీ ఆయనకు ముందే తెలుసు," అన్నాడు రాజు.

రాజు ఇలా అన్న మీదట మంత్రి, దివ్యజ్ఞాని ప్రజలకు చేస్తున్న మేలు గురించీ, ఆయన దివ్యజ్ఞానం ప్రభావం ప్రజల మీద ఎలా ఉంటున్నదన్న విషయం గురించీ శ్రద్ధగా ఆరాలు తీయ సాగాడు. రాజు చెప్పిన మాట నిజం. దివ్యజ్ఞాని కొందరికి కష్టాలు ఏ రూపంలో వచ్చేదీ చెబుతున్నాడు, కొందరికి తమ ప్రయత్నాలు ఫలించవని చెబుతున్నాడు. ఇంకా కొందరికి జరగబోయే మంచి చెబుతున్నాడు. దివ్యజ్ఞాని చెప్పిన మాటలనుబట్టి, తమ ప్రయత్నాలు ఫలించవని ముందుగానే తెలుసుకున్న వాళ్ళు ప్రయత్నాలు మానేస్తున్నారు. మేలు జరుగుతుందని తెలిసినవాళ్ళు నిశ్చింతగా చేతులు కట్టుకుని కూర్చుంటున్నారు.

ఈ వివరాలు తెలుసుకున్న మీదట ఒక రాత్రి లోకమంతా నిద్రపోతున్న సమయంలో, సుదర్శన మంత్రి ఇద్దరు అంతరంగికులతో సహా దివ్యజ్ఞాని పర్ణశాలకు వెళ్ళి, దివ్యజ్ఞానిని నిద్రలేపి, రథం ఎక్కమని, ఒక అంతరంగికుడి వెంట ఆ రథంలోనే దూర దేశానికి పంపేసి, రెండో అంతరంగికుడికి దివ్యజ్ఞాని లాగా జుట్టూ, గడ్డాలూ, మీసాలూ పెట్టి పర్ణశాలలో ఉంచాడు.

మర్నాటి నుంచీ జనానికి దివ్యజ్ఞాని చెప్పేవి నిజం కావటం మానాయి. దివ్యజ్ఞానే మారిపోయాడని వారికి తెలీదు. సాధువుకు శక్తులు అంతరించిపోయాయనుకుని జనం క్రమంగా రావటం మానేశారు. ఒక మంచి రోజు చూసి, మంత్రిగారి అంతరంగికుడు పర్ణశాల పాడుబెట్టి మంత్రి దగ్గిరికి తిరిగి వచ్చాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, తనకు ఎంతో మేలు చెయ్యటమేగాక, ప్రజలను లేనిపోని శ్రమల నుంచీ, దురాశల నుంచీ కాపాడుతూ వస్తున్న దివ్యజ్ఞానిని మంత్రి ఎందుకు దూరంగా పంపేశాడు? ఆయనవల్ల ఎవరికీ ఎలాటి నష్టమూ లేదుగదా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో, నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''దివ్యజ్ఞాని భవిష్యత్తును నిజంగా మార్చగలవాడైతే ఆయనవల్ల లాభం ఉండేమాట నిజమే. కాని రాజు నిరూపించినట్టు ఆయనకు భవిష్యత్తు మాత్రమే తెలిస్తే, అందువల్ల ప్రజలకూ, దేశానికీ తీరని నష్టం ఉన్నది. భవిష్యత్తు రూఢిగా తెలిసినప్పుడు మనుషులు ప్రయత్నాలు మానేస్తారు. ప్రయత్నమే మానవజాతిని ముందుకు నడిపిస్తున్నది. జ్ఞానం అభివృద్ధి కావటానికి విఫల ప్రయత్నాలు కూడా ఎంతగానో తోడ్పడతాయి. విద్య చెప్పే గురువు శిష్యులకు తప్పులు చేసే అవకాశం ఇచ్చి, ఆ తప్పుల ద్వారా వారి జ్ఞానం పెంపొందేటట్టు చేస్తాడు. ఊరికే బోధించి పంపే గురువు శిష్యులను విద్యావంతులను చేయలేడు. బోధ ఎప్పుడూ శిక్షణ కాదు. ప్రజలైనా అంతే. ప్రయత్నం ఫలించదని ముందే తెలిస్తే ప్రయత్నం చెయ్యరు. మంచి జరగబోతుందని నమ్మకంగా తెలిసినా ప్రయత్నం తల పెట్టరు. అలాటి ప్రజలు ఏదీ సాధించ లేరు, వట్టి సోమరిపోతులుగా, జంతు ప్రకృతిగలవారుగా తయారవుతారు. చివరకు జంతువులు కూడా ప్రయత్నం చేస్తాయి. కాని భవిష్యత్తు రూఢిగా తెలిసినవారు కృషి మానేస్తారు. అది దేశానికి చాలా నష్టం. అందుకే మంత్రి దివ్యజ్ఞానిని సాగనంపాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# కులం — గుణం

కొన్ని వందల ఏళ్ల క్రితం సింధుదేశంలో సోమనాధు డనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి వజ్రనాభు డనే కొడుకు ఉండేవాడు. వజ్రనాభుడు ఒక బెస్తకన్యను ప్రేమించాడు. ఆమె చాలా అందగత్తె కావటం మాత్రమేగాక, ఒక వస్త్రధారణలో తప్ప అన్ని విషయాలలోనూ అగ వర్ణ కన్యలాగే ఉండేది.

కాని తన కొడుకు బెస్తపిల్లను చేసుకుంటానంటే సోమనాధుడు ఒప్పుకోడు. ఏం చెయ్యాలో తోచక వజ్రనాభుడు ఒక స్నేహితుణ్ణి సలహా అడిగాడు.

"ఆ పిల్లకు మంచి బట్టలు కట్టపెట్టి, బ్రాహ్మణ పిల్లేననీ, నాకు పెళ్ళాడాలని ఉన్నదనీ నీ తండ్రికి చెప్పు, ఒప్పుకుంటాడు! పెళ్ళి అయాక తెలిస్తే తెలియనీ," అన్నాడు స్నేహితుడు.

వజ్రనాభుడు తన ప్రియురాలికి మంచి బట్టలు కట్టబెట్టి, తన తండ్రి వద్దకు తీసుకుపోయి, "ఈమె బ్రాహ్మణ కన్య. నేను ప్రేమించి పెళ్ళాడగోరుతున్నాను," అన్నాడు.

వెంటనే ఆ పిల్ల కంగారుపడి, "అయ్యా, ఇది అబద్ధం! నేను బ్రాహ్మణ పిల్లను కాను, బెస్త పిల్లను!" అన్నది.

సోమనాధుడు కొడుకు చెంప ఛెళ్ళుమనిపించి "అబద్ధం ఆడటానికి సిగ్గు లేదురా? అలాటి నిజాయితీగల పిల్ల నా కోడలైతే నాకేమీ అభ్యంతరం లేదు. కాని ఆ పిల్ల నిన్ను పెళ్లాడుతుందో లేదో తెలుసుకో!" అన్నాడు.

—యండపల్లి పాండురంగ





# పొరుగువాళ్ళకు లాగే!

జానకీ, పార్వతీ ఇరుగు పొరుగు ఇల్లాళ్లు. పార్వతి తెలివైనది. ఉన్నంతలో సంసారం పొదుపుగా గడుపుకుని వస్తూ, సుఖ జీవనం చేస్తున్నది. జానకి అసూయాపరురాలు. తాను పార్వతికన్న వైభవంగా ఉండాలనుకునేది. అందుకోసం ఆమె ఖరీదైన సామానులు కొని, తన ఇంటిని అందంగా అలంకరించేది. అయినా, పార్వతి తెలివిగలదీ, పొదుపరీ కావడం చేత ఆమె ఇల్లే ఎక్కువ వైభవంగా ఉండేది.

జానకి అసూయ భరించలేక, తన భర్తను ఉపాయం అడిగింది.

ఆమెతో విసిగి ఉన్న భర్త, "పొరుగు వాళ్ళను మించాలని నువు కొంప గుండం చేస్తున్నావు. ఇకనుంచీ, ముందుగా నువు ఏమీ కొనకు; పక్కవాళ్ళు ఏదన్నా కొనే దాకా ఆగి, నువూ అదే కొను. అప్పుడు మనం వాళ్ళతో సమంగానైనా ఉండగలుగుతాం," అని సలహా ఇచ్చాడు.

భర్త చెప్పినట్టు చెయ్యటం మొదలు పెట్టినాక జానకికి కాస్త మనశ్శాంతి లభించింది. ఆమె ఇప్పుడు పార్వతితో సమంగా ఉండగలుగుతున్నది.

జానకికీ, పార్వతికీ కూడా పిల్లలు లేరు. కాని ఆ విషయం వాళ్ళు బెంగపడుతున్నట్టు ఎప్పుడూ కనిపించలేదు. పిల్లలు పుట్టరేమోనని దిగులుపడే వయసు కూడా కాదు వాళ్ళది. అయితే వాళ్ళ ఊరికి ఒక సాధువు వచ్చి, అందరికీ సహజమైన కోరికలు తీరేలాగ ఆశీర్వదిస్తున్నాడని తెలిసి, పార్వతి ఆ సాధువును చూడబోయింది. పార్వతి వెళుతున్నదని తెలిసి జానకి కూడా ఆమె వెనకనే వెళ్లింది. ఇద్దరూ సాధువును పూజించారు. సాధువు వాళ్ళను కనిక

జొన్నలగడ్డ రామలక్ష్మి

రించినట్టు కనబడి, ఇద్దరికీ ఒక మంత్రం చెప్పి, "దీన్ని జపించుతూపోతే మీలో గాఢంగా ఉన్న కోరిక తీరుతుంది," అన్నాడు.

ఇద్దరూ ఇళ్లకు వచ్చేశారు. పార్వతి గదిలో కూర్చుని తనకు పండులాంటి కొడుకు కలగాలని కోరుకుంటూ మంత్రం జపించసాగింది.

జానకికి పెద్ద చిక్కు వచ్చిపడింది. మంత్రం చదివి పార్వతి ఏం కోరుకుంటున్నదో తనకు తెలియదు. తనకు తెలిసినదల్లా పార్వతితో సమంగా జీవించటమే. అదే ఆమె భర్త ఇచ్చిన సలహా. అందుచేత ఆమె, పార్వతికి జరిగినట్టే తనకూ జరగాలని కోరుకుంటూ మంత్రం జపించింది.

కాలక్రమాన పార్వతికి పండంటి కొడుకు కలిగాడు. మంత్ర ప్రభావం వల్లనేమో, జానకి కూడా పండంటి కొడుకును కన్నది. జానకి మంత్రాన్ని ఎంత తెలివిగా ఉపయోగించుకున్నదీ తెలిసి, భర్త ఆమెను ప్రశంసించాడు. తాను అలా చెయ్యటానికి కారణం తన భర్త సలహాయే గనక, జానకి తన భర్తను ప్రశంసించింది.

ఇలా ఉండగా ఒక రాత్రి దొంగలుపడి పార్వతి ఇల్లు దోచేశారు.

ఆ రాత్రే జానకి ఇంట కూడా దొంగల దోపిడీ జరిగింది.

ఈ దోపిడీలవల్ల పార్వతికే ఎక్కువ నష్టం. ఎందుకంటే ఆమెకు అండగా ఉండదగిన సంపన్నులెవరూ లేరు. ఈ నష్టం కూడటానికి ఆమెకు అనేక సంవత్సరాలు పట్టుతుంది. జానకికి అలా కాదు, ఆమెకు ఎంతో అండ ఉన్నది. ఆమెకు కలిగిన నష్టాన్ని ఆమె బంధువులు క్షణాల మీద సరిచెయ్యగలరు. కాని, మంత్రప్రభావం వల్ల కాబోలు, ఒక్కరూ ఆమెకు సాయం రాలేదు! వరం బెడిసి కొట్టింది. పార్వతి పడ్డకష్టాలన్నీ తాను కూడా పడుతూ, పార్వతికి ఇంక ఎలాటి కష్టమూ రాకూడదని, రోజూ వెయ్యి దేవుళ్ళకు మొక్కుకోసాగింది.





# అమాయకుడు

వరహాలు అమాయకుడు. చిన్నతనంలోనే తల్లీ, తండ్రీ పోతే, వాణ్ణి వాడి అవ్వ పెంచి పెద్దవాణ్ణి చేసింది. వాడి మనసు మంచిదేగాని, అశుభమూ, శుభమూ తెలియక వాడు అస్తమానమూ నలుగురిచేతా చివాట్లు తినేవాడు.

ఒకసారి వాళ్ళ ఊళ్ళో బావులన్నీ ఎండిపోతే, ఊరి వాళ్లు దూరంగా ఉన్న నది నుంచి నీరు తెచ్చుకోవలసి వచ్చింది. ఒకనాడు వరహాలు వీధి వెంట నడుస్తూండగా, ఒక వయసు మళ్లిన స్త్రీ నీళ్ళ బిందెను మొయ్యలేక మోస్తూ, ఒక అరుగు మీద దింపి, మళ్లీ ఎత్తుకోలేక ప్రయాసపడుతూ కనిపించింది.

వరహాలు ఆమెకు సహాయం చేద్దామని బిందె ఎత్తబోయాడు.

"మడినీళ్లు ముట్టుకున్నావుట్రా, దౌర్భాగ్యుడా?" అంటూ ఆవిడ బిందెడు నీళ్ళూ వాడిమీద పోసి, వరహాలును తిట్టుకుంటూ మళ్ళీ నదివైపుకు వెళ్ళిపోయింది.

వరహాలు తడిబట్టలతో ఇంటికి వెళ్ళి, అవ్వచేతా చివాట్లు తిన్నాడు.

ఇంకోసారి వరహాలు కూరలు తీసుకుని ఇంటికి వస్తూ ఉంటే ఒక పిల్లవాడు పరిగెత్తుకుని వస్తూ కనిపించాడు. వాడి వెనకగా ఒక ముసలాయన, "ఆగరా, దొంగ వెధవా! రెండు దెబ్బలు పడితే గాని నీకు బుద్ధిరాదు!" అని ఆయాసపడుతూ వస్తున్నాడు.

వరహాలు ఆ ముసలాయనకు సహాయపడే సదుద్దేశంతో కుఱ్ఱవాణ్ణి పట్టుకుని, రెండు దెబ్బలు వేసి, ముసలాయనతో, "తాతగారూ, హైరాన పడకండి. నేనే రెండు వేశాను! దాంతో వాడికి బుద్ధి వస్తుంది లెండి," అన్నాడు.

మాచిరాజు కామేశ్వరరావు

దెబ్బలు తిన్న కుర్రవాడు గొల్లుమన్నాడు.

ఎవడో దారినపోయే దానయ్య తన మనవణ్ణి కొట్టడం చూసి ముసలాయన మండిపడి, ''ఎవడివిరా నువ్వు? చంటి వెధవని కొట్టడానికి నీ చేతులెలా వచ్చాయి?'' అని వరహాలును శాపనార్థాలు పెడుతూ, తన మనవణ్ణి ఓదార్చి తీసుకుపోయాడు.

ఈ గొడవకి అక్కడ పోగయిన నలుగురూ వరహాలును చివాట్లు పెట్టారు.

వరహాలు దిగాలుపడిన మొహంతో ఇంటికి వెళ్ళి, జరిగిన సంగతి అవ్వకు చెప్పి, ఆవిడచేత మరిన్ని చివాట్లు తిన్నాడు.

ఒక ఏడు నదికి పుష్కరాలు వచ్చాయి. వరహాలు రోజూ నదికి వెళ్ళి, రేవుకు దూరంగా స్నానంచేసి, గట్టున ఒంటరిగా కాస్సేపు కూర్చుని ఇంటికి వచ్చేవాడు.

ఒకనాడు వాడు అలా కూర్చుని ఉండగా ఎవరో దంపతులు ఆ ప్రదేశంలో స్నానంచేసి అటుగావచ్చి ఒడ్డు ఎక్కారు. భర్త గట్టు ఎక్కాడు. కాని భార్య ఎత్తుగా ఉన్న గట్టు ఎక్కలేక తన భర్తకు చెయ్యి అందించింది. భర్త ఆ సంగతి చూడక ముందుకు వచ్చాడు. అది చూసిన వరహాలు చప్పున భార్య చేతిని తన చేతితో పట్టుకుని పైకి లాగాడు.

భర్త వెనక్కు తిరిగివచ్చి, వరహాలును చావ చితకతన్ని వదిలిపెట్టాడు.



జబ్బుచేసి మంచాన పడి ఉన్న అవ్వ, దెబ్బలు తిని వచ్చిన వరహాలును చూసి కంట తడి పెట్టుకుని, "నువ్వు మంచి వాడివిరా, వరహాలూ! కాని నేను పోయాక, నీ కోసం జాలిపడే వాళ్ళు ఈ ఊళ్లో ఎవరూ ఉండరు. నీ అమాయకత్వాన్ని ఎవరూ సహించరు. నన్ను బూడిద చేసినాక ఈ ఊళ్ళో ఉండకు. ఇంకెక్కడైనా పోయి బతుకు. ఎక్కడికి వెళ్ళినా, నిన్ను పిలిచి సహాయం అడిగిన దాకా ఎవరికీ ఏ సహాయమూ చెయ్యకు." అని చెప్పింది.

తరవాత త్వరలోనే అవ్వపోయింది. వాడు అవ్వకు ఉత్తర క్రియలు చేసి, అవ్వ చెప్పిన ప్రకారం తన బతుకు తెరువు చూసుకోవటానికి ఇంకో ఊరు బయలుదేరాడు.

వాడు అడవి దారిన వెళుతూండగా, దారి పక్కనే ఉన్న పాడుబడిన బావి నుంచి, "రక్షించండి! రక్షించండి!" అన్న కేకలు వినిపించాయి.

చప్పున అటుకేసి వెళ్ళబోయిన వరహాలు, అవ్వ మాటలు గుర్తుకు వచ్చి, అగిపోయాడు. ఆ అరిచే మనిషి తనను పేరు పెట్టి పిలిచి, రక్షించమంటే తప్ప తాను సహాయపడరాదు!

ఇంతలో ఇద్దరు రాజభటులు అటుగా వచ్చి, బావి నుంచి వస్తున్న కేకలు విన్నారు. సమీపంలో తచ్చాడుతున్న వరహాలును చూసి వాళ్లు అనుమానపడి,



వాణ్ణి దగ్గిరలో ఉన్న చెట్టుకు కట్టేసి, బావిలో పడిన మనిషిని లతల సహాయంతో పైకి లాగారు.

ఆ మనిషి వాళ్ళతో, "నేను వ్యాపారం మీద పట్నం వెళుతూ, దాహం వేసి, ఈ బావిలో నీళ్ళున్నాయేమోనని తొంగి చూశాను. ఇంతలో ఎవడో దొంగ వెధవ నా చేతిలో ఉన్న సంచీ లాగేసి, నన్ను ఒక్క ఊపున బావిలోకి తోసేశాడు. ఇంకా నయం బావిలో నీరు ఎక్కువ లేదు; బతికిపోయాను!" అన్నాడు ఆయాసపడుతూ.

"నిన్ను బావిలోకి తోసిన వెధవ వీడే అయి ఉంటాడు," అని రాజభటులు ఆ మనిషికి, చెట్టుకు కట్టివున్న వరహాలును చూపారు.

వరహాలు ఏడుస్తూ, "నేను ఏ పాపమూ ఎరగను. నేను ఆయనను రక్షించుదామని అనుకున్నాను కూడా. అందుకు ఒక కారణం ఉన్నది," అంటూ తన కథ అంతా చెప్పాకున్నాడు.

బావిలో పడిన మనిషికి వరహాలు తత్వం బోధపడింది. అతను రాజభటులతో, "నన్ను బావిలోకి తోసిన మనిషి ఇతను కాదు. వాడు చాలా బలశాలి. నేను బావిలో పడి చాలాసేపు అయింది. నన్ను తోసినవాడు ఇంకా ఇక్కడ ఎందుకు తారట్లాడుతూవుంటాడు?" అన్నాడు.

"అయితే అసలు దొంగను పట్టుకుంటాం," అంటూ రాజభటులు వెళ్ళిపోయారు.

తరవాత బావిలో పడినవాడు వరహాలుతో, "నువు ఎక్కడా బతకలేవు, నా వెంటరా! నా తోట పని చూసుకుంటూ తోటలోనే ఉండు. నీ జోలికి ఎవరూ రారు. నీకు ఎవరి జోలీ ఉండదు. నోరు లేని మొక్కలు నీ సహాయానికి ఎదురు చెప్పవు. నీకు జరుగుబాటు అయేటట్టు నేను చూస్తాను," అన్నాడు.

వరహాలు సంతోషంగా ఒప్పుకుని, ఆ మనిషి వెంట వెళ్ళాడు.








దధీచి చ్యవనుడి కొడుకు. ఇతను సారస్వతతీర్థంలో తపస్సు చేసుకుంటూంటే, తన స్థానం ఆక్రమిస్తాడని ఇంద్రుడు భయపడి, అతనికి తపోభంగం చెయ్యటానికి అలంబుస అనే అప్సరను పంపాడు.

చిత్రం ఏమిటంటే ఇంద్రుడు తన జాతికి చెందినవారిని "తొమ్మిది తొంభైల మందిని" వధించి, తాను దేవతలకు ఇంద్రత్వం సంపాదించుకున్నాడు. నూరు యజ్ఞాలు చేసిన వాడెవడైనా తన స్థానం ఆక్రమించుకుంటాడని ఇంద్రుడికి భయం. ఈ భయంతో అతను అనేక మంది ఋషుల తపస్సును భంగం చెయ్యటానికి అప్సరలను పంపించి, చాలావరకు నెగ్గాడు.

దధీచి విషయంలో ఇంద్రుడు నెగ్గాడనే చెప్పాలి. ఎందుకంటే అలంబుస దధీచి తపస్సు భంగం చెయ్యటమే గాక, ఆ కారణంగా దధీచికి సారస్వతుడనే కొడుకు కలిగాడు.

అయినా దధీచి మహాతపశ్శాలి. ఇంద్ర పదవి వెయ్యి ఏళ్ళపాటు ఖాళీ అయితే, దధీచి ఆ కాలంలో ఇంద్రత్వం నిర్వహించాడు. ఆ కాలంలోనే దక్షుడికి, దక్షుడి అల్లుడైన శివుడికి తగాదా వచ్చింది. బ్రహ్మ చేసే యజ్ఞానికి దక్షుడు వెళ్ళితే, ఆయనను చూసి అందరూ లేచారుగాని, శివుడు లేవలేదు. దక్షుడు ఆ కోపం మనసులో పెట్టుకుని, శివుణ్ణి పెళ్ళాడిన తన సొంత కూతురు సతిని తన యజ్ఞానికి పిలవలేదు. సతి పిలవని పేరంటంగా దక్షయజ్ఞానికి వెళ్ళి, తండ్రి చేత అవమానం పొంది, అగ్నిలో పడి ఆత్మహత్య చేసుకున్నది. ఆ సంగతి తెలియగానే శివుడు ఆగ్రహావేశం చెంది, వీరభద్రుణ్ణి

సృష్టించి, అతని నాయకత్వాన ప్రమథ గణాలను దక్షవాటికకు పంపి, యజ్ఞం ధ్వంసం చేయించాడు. దక్షుడి తల తెగి పోయింది. తరవాత దేవతలు దక్షుడి మొండానికి గొర్రె తల అతికించి, ఆయన చావకుండా కాపాడారు.

దక్షుడికీ, శివుడికీ వచ్చిన ఈ వైరంలో దధీచి ఒక్కడే శివుడి పక్షాన్ని సమర్థిం చాడు. అతను శివభక్తుడు.

దధీచి భార్య లోపాముద్ర.

దేవతలు తమ అస్త్రాలను దధీచి దగ్గర దాచుకునేవారు. వాటిని రాక్షసులు ఎత్తుకుపోతారని వాళ్ళ భయం. అయితే చాలా కాలం వాళ్ళు ఆ ఆయుధాల కోసం రాలేదు. దధీచి ఎలాగో వాటిని పోగొట్టు కున్నాడు. తీరా దేవతలు వచ్చి తమ అస్త్రాలు తమకు తిరిగి ఇయ్యమనేసరికి, "నేను మీ అస్త్రాలు తిరిగి ఇయ్యలేను. వాటిని తాగేశాను!" అన్నాడు దధీచి.

"మా అస్త్రాలు మాకు తిరిగి ఇయ్యాలి సిందే," అన్నారు దేవతలు.

"మీ అస్త్రాలు నా ఎముకలకు పట్టి పోయాయి. నా ఎముకలు తీసుకుని ఆయుధాలుగా ఉపయోగించుకోండి," అని దధీచి అన్నాడు.

"నువు బతికి ఉండగా నీ ఎముకలను ఆయుధాలుగా ఎలా ఉపయోగించుకో గలం?" అని దేవతలు అడిగారు.

అప్పుడు దధీచి తన తపశ్శక్తి చేత అగ్ని పుట్టించి, అందులో తాను దగ్ధ మయాడు. అతని ఎముకల నుంచి బ్రహ్మ చక్రాన్నీ, వజ్రాయుధాన్నీ, ఇతర ఆయు ధాలనూ సృష్టి చేశాడు.

దధీచి ఎముకలతో వజ్రాయుధం ఒక్కటే తయారయినట్టు కూడా చెబు తారు. ఇది ఇంద్రుడి తిరుగులేని ఆయు ధంగా పురాణ ప్రసిద్ధమయింది. దీనితోనే ఇంద్రుడు మహాబలశాలి అయిన వృత్రుణ్ణి సంహరించాడు.

దధీచి చనిపోయే సమయానికి లోపా ముద్ర గర్భవతిగా ఉండి, తరవాత పిప్పలాదుడనేవాణ్ణి కన్నది.



# చంద్రహాసుడు



కేరళ రాజును శత్రువులు చంపారు. అతని భార్య తన భర్తతో సహగమనం చేసింది. వారి కొడుకైన చంద్రహాసుడు పసిగుడ్డు. అతన్ని ఒక దాసి కుంతల దేశం చేర్చింది.

కుంతల రాజుకు పిల్లలు లేరు. మంత్రి దుష్టబుద్ధి తన కొడుకు రాజవుతాడని ఆశిస్తున్నాడు. అయితే ఒకనాడు చంద్రహాసుణ్ణి చూసి ఆస్థానజ్యోతిష్కుడు, "ఆ కుర్రవాడు రాజవుతాడు!" అన్నాడు.





చంద్రహాసుడు బతికి ఉంటే తన కొడుకు రాజు కాలేడని, దుష్టబుద్ధి చంద్రహాసుణ్ణి చంపించటానికి కటిక వాళ్లను నియమించాడు. కాని వాళ్ళు ఆ కుర్రవాణ్ణి చంపటానికి చేతులు రాక అడవిలో వదిలేశారు.



కుళిందకుడు అనే రాజు వేటకు వచ్చి, చంద్రహాసుణ్ణి చూసి, పిల్లలు లేని వాడు కావటాన, అతన్ని తన కొడుకుగా పెంచుకోసాగాడు. చంద్రహాసుడు చావ లేదని తెలిసి, దుష్టబుద్ధి అతన్ని తన పరివారంలో ఉంచుకున్నాడు.

దుష్టబుద్ధి కొడుకు మదనుడు ఒక ప్రాంతానికి రాజప్రతినిధిగా ఉంటు న్నాడు. దుష్టబుద్ధి ఒక ఉత్తరం రాసి, దాన్ని చంద్రహాసుడి ద్వారా మదనుడికి పంపాడు. చంద్రహాసుడు రాజప్రతినిధి ఆవరణ చేరి, అలసిపోయి, ఒక చెట్టు కింద నిద్రపోయాడు.





దుష్టబుద్ధి కుమార్తె అయిన విషయ తన అన్న వెంట ఉన్నది. ఆమె నిద్రి స్తున్న చంద్రహాసుణ్ణి చూసి మోహించి, అతని వద్ద ఉన్న ఉత్తరం తీసి చదివింది. అందులో చంద్రహాసుడికి "విషం" ఇయ్యమని ఉన్నది. ఆమె "విషం" అనే మాటను "విషయ"గా మార్చింది.

తరవాత చంద్రహాసుడు మదనుణ్ణి కలుసుకుని, ఉత్తరం ఇచ్చాడు. అందులో చంద్రహాసుడికి విషయను ఇయ్యమని రాసివుంది. మదనుడు ఇద్దరికీ పెళ్లి చేసేశాడు.





తరవాత దుష్టబుద్ధికి తన పథకం బెడిసి కొట్టినట్టు తెలిసింది. చంద్రహాసుడు చావకపోగా తనకు అల్లుడై కూర్చున్నాడు. అయినా దుష్టబుద్ధి అతన్ని చంపించే ఆలోచన మానలేదు.

దుష్టబుద్ధి చంద్రహాసుడితో, "ఇవాళ అర్ధరాత్రి వేళ నువు చండికాలయానికి వెళ్ళి, దేవిని కొలిచి రా. అది గొప్ప శుభముహూర్తం!" అని చెప్పాడు. తన తండ్రి చంద్రహాసుడితో యిలా చెప్పటం మదనుడు విన్నాడు.





అర్ధరాత్రివేళ చంద్రహాసుడు బయలు దేరబోతూండగా, విషయ సందేహ పడి, అతన్ని చండికాలయానికి వెళ్లవద్ద న్నది. కాని శుభముహూర్తం తనకు కూడా లాభిస్తుందని వెళ్లిన మదనుణ్ణి. ఆలయంలో హంతకులు చంపేశారు,

తన ప్రయత్నం విఫలం కావడమే కాక, తన కొడుకు చావటం చూసి, దుష్టబుద్ధి గుండె పగిలి చనిపోయాడు.





రాజు తన కూతురిని కూడా చంద్ర హాసుడికే ఇచ్చి పెళ్లి చేశాడు. రాజు అనంతరం చంద్రహాసుడే రాజై, చాలా కాలం పాలించి, గొప్ప రాజుగా ఖ్యాతి పొందాడు.



# కుమారస్వామి

శివుడి వల్ల గర్భవతి కావలసిన పార్వతి తన గర్భాన్ని అగ్నిచేత ధరింపజేసింది. అగ్ని దాన్ని గంగకు బదిలీ చేశాడు. గంగ దాన్ని తన ఒడ్డున ఉన్న రెల్లు దుబ్బులలో విడిచిపెట్టింది. అక్కడే కుమారస్వామి పుట్టాడు.

అలా రెల్లులో పుట్టిన పిల్లవాణ్ణి ఆరుగురు కృత్తికలూ పాలిచ్చి పెంచారట. అందుచేతనే కుమారస్వామికి ఆరు ముఖాలు ఏర్పడ్డాయనీ, అతనికి కార్తికేయుడని పేరు వచ్చిందనీ అంటారు. సప్తమహర్షుల భార్యలు ఏడుగురిలో వసిష్ఠుడి భార్య అయిన అరుంధతి తప్ప మిగిలిన ఆరుగురూ కుమారస్వామిని పెంచారని కూడా ఒక కథ ఉన్నది. వారే కృత్తికలని చెబుతారు.

కుమారస్వామి పుట్టినప్పుడు అతని సమీపంలోనే శివుడి విల్లు, త్రిపురాసురులను చంపినది, ఉన్నదట. కుమారస్వామి దాని నారి పట్టిలాగేసరికి పెద్దగా చప్పుడయిందట. అప్పుడు రెండు దిగ్గజాలు కుమారస్వామి మీద పడ్డాయట. ఆ చంటి పిల్లవాడు వాటిని బంతుల్లాగా ఎగరవేసి ఆడుకుంటూ, కేరింతాలు కొట్టాడట.

కుమారస్వామి పుట్టిన తరవాత బ్రహ్మ అతనికి పార్వతీ పరమేశ్వరులను చూపించి, "వీరే నీ తల్లిదండ్రులు", అని చెప్పాడట. ఇంద్రుడు ఐరావతం తాలూకు గంటలు రెండు తెచ్చి కుమారస్వామికి బహుమానంగా ఇచ్చాడు.

కుమారస్వామి పుట్టినప్పుడు లోకమంతా సంక్షోభం పొందింది. అది చూసీ, కుమారస్వామి దర్పం చూసీ భయపడి, మునులూ, దేవతలూ ఇంద్రుడి దగ్గిరికి పరిగెత్తి, "ఈ కుమారుడు నిన్ను ఓడించి ఇంద్రుడవుతాడు. అందుచేత ముందే

నువు అతన్ని చంపు!'' అని సలహా ఇచ్చారు. ఇంద్రుడు సప్తమాతృకలను పిలిచి, కుమారుణ్ణి చంపి రమ్మన్నాడనీ, వాళ్ళు అలా చెయ్యక, కుమారస్వామికి తల్లులలాగా ఉండటానికి సిద్ధపడ్డారనీ మరో కథ.

సప్తమాతృకల ద్వారా కుమారుణ్ణి చంపించలేక, ఇంద్రుడు అతని పైకి యుద్ధానికి వచ్చి, తన వజ్రాయుధాన్ని ప్రయోగించాడు. అది కుమారుడికి కుడి భాగంలో తగిలి, దానినుంచి మేకముఖం గల విశాఖుడు పుట్టుకు వచ్చాడు. విశాఖుడితో బాటు కన్యాకుమారగణాలు అనేకం పుట్టాయి. వాటిని చూసి ఇంద్రుడు భయపడి, కుమారస్వామినే శరణు జొచ్చాడు.

''నీకు ఏం కావాలి?'' అని కుమారుడు ఇంద్రుణ్ణి అడిగాడు.

''నువు నాతో సఖ్యంగా ఉండాలి. నా ఇంద్ర పదవి నువే తీసుకో,'' అన్నాడు ఇంద్రుడు.

''నాకు నీ ఇంద్ర పదవి అవసరం లేదు,'' అన్నాడు కుమారుడు.

''అలాఅయితే, దేవతలకు సేనానాయకుడుగా ఉండు,'' అన్నాడు ఇంద్రుడు.

కుమారస్వామి చాలామంది రాక్షసులను చంపాడు. వారిలో శూరపద్మాసురుడూ, అంధకాసురుడూ మొదలైనవారు ఉన్నారు. క్రౌంచపర్వతం రాక్షసులకు గొప్ప స్థావరం. అందుచేత కుమారస్వామి క్రౌంచపర్వతాన్ని ఛేదించాడు.

అయితే అన్నిటికన్న కుమారస్వామి సాధించిన గొప్ప విజయం తారకాసురుణ్ణి సంహరించటం. తారకాసురుడు బ్రహ్మనుంచి వరాలు పొంది, ఇంద్రుణ్ణి గడగడలాడించినవాడు. బ్రహ్మ కూడా దేవతలకు ఏ విధంగానూ సహాయ పడలేకపోయాడు. ఇదంతా కుమారస్వామి పుట్టుకకు ముందే జరిగింది. అయితే కుమారస్వామి పుట్టి, దేవసేనలకు నాయకుడైనాకగాని తారకాసురుడి వధ సాధ్యం కాలేదు.






# భయం అంటే?

ఒకానొక అడవిలోని కొలను పక్కన వున్న చిన్న ఇంటిలో ఒక పేదరాలు నివసిస్తూ ఉండేది. ఆమెకు ఒక్కగానొక్క కొడుకు, వాడి పేరు సుమంతుడు. వాణ్ణి చిన్నప్పటినించీ ఎంతో గారాబంగా పెంచింది తల్లి.

ఒకనాటి రాత్రి సుమంతుడూ, తల్లీ తమ చిన్న ఇంటిలో హాయిగా నిద్రపోతున్నారు. వున్నట్టుండి గాలి ప్రారంభమై ఉరుములూ, మెరుపుల్తో వాన కూడా ఆరంభమయింది. ఆ గాలీ వాన శబ్దం విని తల్లి మేల్కొన్నది. కొడుకును నిద్ర లేపి, "అబ్బాయీ, నాకు భయంగా వుంది, ఆ కిటికీ రెక్కలు కాస్త మూసి వద్దూ," అని చెప్పింది.

సుమంతుడు నిద్ర లేచాడు. తల్లి మాటలు విన్నాడు. 'భయం' అన్న మాట వాడి జీవితంలో యిదే మొదటి సారిగా వినటం. అందుచేత "కిటికీలు మూస్తాలే, అమ్మా. 'భయం' అంటా వేమిటి? అదెలా వుంటుంది?" అని అడిగాడు.

కొడుకు అడిగిన ఈ ప్రశ్నకేమీ జవాబివ్వలేదు తల్లి. "కుర్రకుంకకి, యీ వివరాలన్నీ చెప్పేదేవిట్లే," అనుకుని తిరుగా కునుకు తీసింది.

దానితో సుమంతుడికి ఆ 'భయం' అంటే ఎలా వుంటుందో చూడాలనిపించింది.

ఇక యిలా కాదు అనుకుని, మెల్లిగా తలుపు తీసుకొని బయటికి వచ్చేశాడు. ఆ చీకట్లో గాలీవానలో అడవి వెంటపడి, "భయం! నీవెలా వుంటావ్? ఎక్కడ ఉంటావ్?" అని అరుస్తూ పోసాగాడు.

"నాయనా, వచ్చావా? ఉయ్యాల అందక యిందాకట్నించి ఎవరొస్తారా



అని చూస్తున్నాను. నువ్వు కాస్త నన్ను భుజాల మీద నిలబడనిచ్చావంటే, పైనవున్న ఉయ్యాల నుంచి మా బాబును కిందకు దింపుతాను,'' అన్న జవాబు వినబడింది.

సుమంతుడు సరే అని అక్కడికి వెళ్ళాడు. అక్కడ ఒక యింటిలో ఒక స్త్రీ నిలబడి వున్నది. పైన దూలానికి ఉయ్యాల వేలాడుతోంది.

నిజానికి ఆవిడ మానవస్త్రీ కాదు, రాక్షసి. ఆ సంగతి తెలీని సుమంతుడు ఆమెను తన భుజాల మీద ఎక్కించుకొన్నాడు. రాక్షసి, సుమంతుణ్ణి తన కాళ్ళతో నలిపి చంపాలని ప్రయత్నం చేసింది. దానితో సుమంతుడికి కోపం వచ్చి రాక్షసి కింద పడేలా చేతులతో గుంజాడు.

బ్రహ్మరాక్షసి బోర్లా కింద పడింది. ఆ పడటంలో నోటి కోరలు రెండూ విరిగిపోయినై, కుయ్యో మొర్రో అంటూ అది అక్కడినించి పారిపోయింది.

సుమంతుడు ఆ యింటినించి బయటికి వచ్చాడు. అప్పటికి బాగా సూర్యోదయం అయింది. గాలివానా వెలిసినై. అడవిలో మరి కొంత దూరం ముందుకు నడిచాడు.

ఒక చోట కొండరాళ్ళ మీద కూర్చొని వున్న కొందరు దొంగలు అతడికి కనిపించారు. వాళ్ళు సుమంతుణ్ణి చూచి, ''ఎవడవురా నువ్వు? ఇక్కడ పిట్ట ఎగరటానికే భయపడుతుంది, రాజుగారి సైన్యాలు రావటానికే జంకుతై, నువ్వేమో భయం లేకుండా యిటు వస్తున్నావ్?'' అన్నారు.

''ఆ భయం ఏమిటో, ఎలా వుంటుందో చూద్దామనే వస్తున్నాను!'' అన్నాడు సుమంతుడు.

దొంగలకు యీ జవాబు నవ్వు తెప్పించింది. వాళ్ళు ఒక పెనం, అట్లకాడా, అట్లపిండీ సుమంతుడి చేతికిచ్చి, ''ఆ చెట్లల్లో వున్న శ్మశానంలోకి వెళ్ళి,

ఈ పిండితో ఒక రొట్టె కాల్చుకురా, భయం అంటే ఏమిటో నీకే తెలుస్తుంది!'' అన్నారు.

సరే అని సుమంతుడు శ్మశానంలోకి వెళ్లి పొయ్యి రాజేసి పెనం మీద రొట్టె కాల్చసాగాడు. ఆ పక్కనే వున్న సమాధి లోంచి యింత పెద్ద చెయ్యి బయటికి వచ్చి, ''అబ్బాయ్! నాక్కాస్త రొట్టె రుచి చూపించవూ?'' అన్నది.

పని తొందరలో వున్న సుమంతుడికి భలే చిరాకెత్తుకొచ్చింది.

''రొట్టె రుచి చూపించాలా? బతికి వున్న వాళ్ళ ఆకలి తీర్చేముందు, నీ ఆకలే తీరుస్తాను,'' అంటూ చేతిలో వున్న అట్లకాడతో ఒక్క దెబ్బ వేశాడు. ఆ దెబ్బతో చెయ్యి సమాధిలోకి మాయమైంది.

తరవాత రొట్టె కాల్చి సుమంతుడు దొంగల దగ్గరకు వచ్చి శ్మశానంలో జరిగినదంతా వాళ్ళకు చెప్పాడు. దొంగలకు సుమంతుడి నిర్భయత్వం చూసి హడలుచ్చుకుంది.

''బాబూ, నీకు భయాన్ని చూపెట్టటం మా వల్ల కాదు. యిక్కడినుంచి తొందరగా సెలవు పుచ్చుకో, నీ పుణ్యం వుంటుంది! మమ్మల్ని యిలా బతకనియ్యి.'' అని బతిమలాడారు.



సుమంతుడు అక్కణ్ణుంచి మరికొంత దూరం వెళ్ళేసరికి ఒక వృద్ధురాలు ఎదురైంది. ''ఎందుకు నాయనా, యీ అడవిలో ఒంటరిగా యిలా తిరుగులాడుతున్నావ్? మీది ఏ వూరు? ఏం పని?'' అని అడిగింది.

సుమంతుడు సంగతంతా చెప్పి, ''అవ్వా, భయం అంటే ఎలా వుంటుందో చూడాలన్న కోర్కె యింకా నెరవేరలేదు,'' అన్నాడు.

అందుకు అవ్వ నవ్వుతూ, "నీలాంటిదే నాకూ ఒక మనమరాలు వుంది. రా నాయనా, నీ కోర్కె అది నెరవేరుస్తుందేమో!'' అని వెంట తీసుకుపోయింది.

అవ్వ మనమరాలు భలే జిత్తులమారి. సుమంతుడి కథ అంతా విని ఒక యుక్తి పన్నింది. వేళ కాగానే సుమంతుడికి అన్నం వడ్డించి, అంత ఎడంగా నిలుచున్నది. తీరా సుమంతుడు అన్నం కలుపుకొని ముద్ద నోట్లో పెట్టుకోబోయే సరికి, "వుండు, వుండు. వండిన కూర చట్టి తేవటం మరచిపోయాను," అంటూ వంటయింట్లోకి వెళ్లి ఒక పెద్ద చట్టి తెచ్చి అతడి ముందు పెట్టింది.

సుమంతుడు కూర వేసుకుందామని చట్టి మూత తెరిచాడు. ఆ వెంటనే అందులోంచి టపటపమనే శబ్దం వచ్చింది. 'అ(' అంటూ సుమంతుడు భయపడి, కూర్చున్న పీట మీద నుంచి వెనక్కు ఒరిగిపోయాడు.

చట్టిలో మూత పెట్టబడివున్న పిచ్చుక ఒకటి తుర్రుమంటూ బయటికి ఎగిరిపోయింది. భయమంటే ఏమిటో తెలియని సుమంతుడు, ఆ పిచ్చుక కేసి చూస్తూ వుండిపోయాడు.

అవ్వ మనమరాలు విరగబడి నవ్వుతూ, "అలా చూస్తావెందుకు? యిప్పుడు తెలిసిందా, 'భయం' అంటే ఎలా వుంటుందో?" అని అడిగింది.

సుమంతుడికి సత్యం ఒప్పుకోక తప్పలేదు. "అవును, భయం అంటే ఏమిటో యిప్పటికి తెలిసింది. యిక మా అమ్మ దగ్గరకు వెళ్తాను. మీ యిద్దరు కూడా మా యింటికి వస్తే మా అమ్మ చాలా సంతోషిస్తుంది," అంటూ లేచాడు.

మగదిక్కు లేనివాళ్ళు కనక, అవ్వా, మనమరాలూ కూడా సుమంతుడి కోరికపై వాళ్ళ యింటికి వెళ్ళారు. సుమంతుడి తల్లికి మహదానందం కలిగింది. అందరూ కలిసి ఒకే కుటుంబంగా బ్రతకసాగారు. సుమంతుడు కూడా ఒళ్ళు వంచి పని చేస్తూ, అన్ని విధాలా మంచివాడనిపించుకున్నాడు.

కొన్నాళ్ళ తర్వాత, సుమంతుడికీ, యుక్తిపరురాలైన అవ్వ మనమరాలుకూ వివాహం జరిగింది.





# పొగడ్తకు కారణం

మగధ రాజ్యాన్ని పాలించిన చంద్రసేన మహారాజు, తన మంత్రిని మారువేషంలో ప్రజల మధ్య తిరిగి, వారు తనను గురించి ఏమనుకుంటున్నదీ చెప్పమనేవాడు. మంత్రి వచ్చి, "తమరిని ప్రజలు పొగడుతున్నారు," అని చెప్పేవాడు. తన ప్రజలు సుఖంగా ఉన్నారని రాజు అనుకునేవాడు.

చంద్రసేన మహారాజు ఆకస్మికంగా మరణించి, అతని కొడుకు ఇందువర్మ రాజ్యానికి వచ్చాడు. అతను కూడా ప్రజాభిప్రాయం తెలుసుకునేటందుకు తన మంత్రిని నియోగించాడు.

మర్నాడు మంత్రి తిరిగి వచ్చి, "మహారాజా, మన రాజ్యానికి దక్షిణాన ఉన్న విక్రమపురిలో ప్రజలు తమను గురించి తెగ తలుచుకుంటున్నారు," అని చెప్పాడు.

ఆ మర్నాడు ఇందువర్మ తానే మారువేషంలో విక్రమపురికి వెళ్ళి, అక్కడికి మంచి రహదారి లేని కారణంచేత, దారిలో చాలా ఇబ్బంది పడ్డాడు. అతను వెంటనే విక్రమపురికి చక్కని రహదారి వేయించాడు. దారి పక్కన చల్లని నీడనిచ్చే చెట్లూ, విశ్రాంతి మండపాలూ ఏర్పాటు చేయించాడు.

కొంతకాలం గడిచింది. ఇందువర్మ మరొకసారి తన మంత్రిని మారువేషంలో దేశం మీదికి పంపాడు. ఈసారి మంత్రి తిరిగివచ్చి, "మహారాజా, అవంతీపురంలో ప్రజలు తమను ఎంతో అభిమానంతో తలుచుకుంటున్నారు," అన్నాడు.

మరొకసారి మహారాజు మారువేషం ధరించి, అవంతీపురం చేరుకున్నాడు. అక్కడి ప్రజలకు తగినంతగా నీటి సౌకర్యం లేదని అతనికి తెలిసివచ్చింది.

రాంబాబు

త్వరలోనే అతను అవంతీపురంలో అనేక చెరువులూ, దిగుడు బావులూ తవ్వించాడు. మరికొంత కాలం గడిచింది. ఇందువర్మ తన మంత్రిని ఇంకోసారి మారువేషంలో వెళ్లి, ప్రజాభిప్రాయం తెలుసుకు రమ్మని పంపాడు.

ఈసారి మంత్రి తిరిగివచ్చి, "మహారాజా, కాంచనపురంలో తప్ప రాజ్యంలో ఇంకెక్కడా ఎవరూ తమ పేరు తలవటం లేదు," అని చెప్పాడు.

ఇందువర్మ మారువేషంలో కాంచనపురానికి వెళ్ళి, అక్కడి ప్రజలకు గల ఇబ్బంది గ్రహించాడు. కాంచనపురానికి సమీపంలో గల పెద్ద సంత ఊరు నదికి అవతల ఉన్నది. నది మీద వంతెన లేదు. అది ప్రజలకు ఇబ్బందిగా ఉన్నది.

వెంటనే పని ప్రారంభింపజేసి, ఇందువర్మ కాంచనపురానికి దగ్గిరలో నది మీద చక్కని వంతెన కట్టించాడు.

తిరిగి కొంతకాలం గడిచినాక ఇందువర్మ తన మంత్రిని మారువేషంలో దేశం మీదికి పంపి, ప్రజలు ఏమనుకుంటున్నదీ తెలుసుకు రమ్మన్నాడు.

ఈసారి మంత్రి తిరిగి వచ్చి, ఎక్కడలేని ఆందోళనా పడిపోతూ, "మహారాజా, దేశంలో ఏ మూలా ఎవరూ తమరిని మాటమాత్రంగానైనా తలుచుకుంటున్నట్టు లేదు," అని చెప్పాడు.

ఇందువర్మ నవ్వి, "మంత్రీ, అది చాలా మంచి లక్షణం! నన్ను గురించి ఎవరూ తలుచుకోవటం లేదంటే ప్రజలకు నాతో పని లేదన్నమాట! వాళ్ళు సుఖంగా ఉన్నారన్నమాట. ప్రజలు ఏది కావలసినా రాజునే నమ్ముకుంటారు. వస్తుతః వారికి రాజు మీద సదభిప్రాయమే ఉంటుంది. కోరికలున్న మనుషులు దేవుణ్ణి తలచుకున్నట్టే, పౌరులు రాజును తలుచుకుంటారు. రాజునూ, దేవుణ్ణీ మరిచిన ప్రజలు ఏ లోటూ లేకుండా సుఖంగా ఉన్నారన్నమాట. మా నాన్నగారికి ఈ రహస్యం తెలిసింది కాదు," అని మంత్రిని ఓదార్చాడు.





# నమ్మకాలు

గవరవరం అనే గ్రామంలో రామశాస్త్రి అనే వైద్యుడు ఉండేవాడు. అతని హస్తవాసి చాలా మంచిదని చెప్పుకునేవారు. ఎవరైనా తనని పొగడుతూ, "మీరు మామూలు మనిషి కాదు. అపరధన్వంతరి! మీ చెయ్యి తగిలితే ఎంతటి రోగమైనా క్షణంలో మాయమవుతుంది," అంటే, రామశాస్త్రి, "నాలో విశేషం ఏమీ లేదు. నన్ను మించిన వైద్యులు చుట్టుపక్కల ఎందరో ఉన్నారు. మీకు నా మీద ఉన్న గురివల్లనే జబ్బులు నయమవుతున్నాయి." అనేవాడు.

అతను అలా అనటంవల్ల అతని పేరు తగ్గకపోగా మరింత పైకి వచ్చింది. "ఎంతో గొప్ప హస్తవాసి కలిగి కూడా రామశాస్త్రి ఎంత వినయ సంపన్నుడు!" అని అందరూ అతన్ని మరింతగా మెచ్చుకున్నారు.

ఇలా ఉండగా ఒకనాడు రామశాస్త్రికి విరేచనాలూ, వాంతులూ పట్టుకున్నాయి. ఈ సంగతి తెలియగానే చాలామంది అతన్ని చూడవచ్చి రకరకాలుగా సలహాలిచ్చారు. కొందరు ఆయనకు తమ వైద్యం చెప్పారు. మరి కొందరు, "మీకు మరొకరి వైద్యం దేనికి? మీ సంచికట్టులో నుంచి ఏ మందు తియ్యమంటారో చెప్పండి. తీసి ఇస్తాం," అన్నారు. ఇంకొందరు పక్క ఊరి పేరిశాస్త్రి వైద్యం చేస్తే బాగుంటుంది అన్నారు. వైద్యుడికి వైద్య సలహా లియ్యటమంటే అందరికీ సరదాగానే ఉంటుంది గదా.

పేరిశాస్త్రి పేరు వినగానే రామశాస్త్రికి ప్రాణం లేచి వచ్చింది. అతను గొప్ప వైద్యుడుగా భావించే వారిలో పేరిశాస్త్రి ఒకడు. అందుచేత రామశాస్త్రి అప్పటికప్పుడే ఊరి వాళ్ల సహాయంతో ఒక ఎడ్ల

షేక్ గాలిబ్

బండి కట్టించుకుని, పేరిశాస్త్రి ఉండే గ్రామానికి వెళ్లాడు.

తీరా వాళ్లు వెళ్ళేసరికి పేరిశాస్త్రి ఇంటికి తాళం పెట్టి ఉన్నది. పేరిశాస్త్రిని కుక్క కరిచిందట; అందుచేత అతను గవరవరంలోనే ఉన్న మరిడయ్యా అనే వైద్యుడి కోసం వెళ్లాడట.

"పేరిశాస్త్రికే మరిడయ్యా మీద అంత గురి అయితే నేను కూడా అతని చేతనే చికిత్స పొందవచ్చు. పేరిశాస్త్రికి పనికి వచ్చేవాడు నాకు పనికి రాడా?" అని రామశాస్త్రి తన ఊరికే తిరిగి ప్రయాణమై వచ్చాడు.

మరిడయ్యా ఇంటిదాకా బండిపోయే దారి లేదు. కొంతదూరం పోయాక రామశాస్త్రి బండి దిగి, తనకు తోడు వచ్చిన వాళ్ళతో కాలిబాటన మరిడయ్యా ఇంటికేసి బయలుదేరాడు.

వాళ్ళు మరిడయ్యా ఇంటిని సమీపించేసరికి, లోపలి నుంచి శోకాలు వినిపిస్తున్నాయి. ఇంటి చుట్టూ జనం మూగి ఉన్నారు. ఆ జనంలో పేరిశాస్త్రి రామశాస్త్రికి కనిపించాడు.

రామశాస్త్రి ఆయనతో, "ఏమండీ, మరిడయ్యా వద్ద చికిత్స పొందుతున్న వారెవరైనా పోయారా?" అన్నాడు.

పేరిశాస్త్రి రామశాస్త్రిని ఎరగడు. అతను రామశాస్త్రితో, "ఎవరో కాదు. మరిడయ్యే పోయాడు. అతనికి క్రితం రాత్రి నుంచీ వాంతులూ, విరేచనాలూ పట్టుకున్నాయిట. తాను అందరి రోగాలకూ మంత్రాలు వేస్తాడుగాని, తన మంత్రంలో తనకే నమ్మకం లేకపోయింది. ఎవరో రామశాస్త్రిట! అతనిపద్ద చికిత్స పొందుదామని చివరకు నిశ్చయించుకుని బయలుదేరాడట. కాని అప్పటికే ఆలస్యం అయిపోయి, దారిలోనే పోయాడట!" అని చెప్పాడు.

రామశాస్త్రి తన వెంట ఉన్న వాళ్ళతో, "పదండి! నా జబ్బుకు నేనే వైద్యం చేసుకుంటాను. ఇప్పుడు నాలో నాకు నమ్మకం కుదిరింది," అన్నాడు.



# రాళ్ల విలువ

సులోచనుడు రత్ననిపుణుడు. అతని పొరుగునే ఒక షావుకారు ఉంటున్నాడు. రంగడు అనే పేదవాడు రోజూ షావుకారు ఇంటికి వస్తూ, పోతూండటం సులోచనుడు చూసి, ఒకసారి వాణ్ణి సంగతి ఏమిటని అడిగాడు.

"రోజూ నా సంపాదనలో నుంచి కొంచెం కొంచెం షావుకారు దగ్గిర దాచుకుంటున్నాను. మా అమ్మాయికి సంబంధం కుదిరింది. వచ్చే వారం డబ్బంతా తీసుకుంటాను," అన్నాడు రంగడు.

షావుకారు రంగణ్ణి మోసగించే ఆలోచనలో ఉన్నాడని తెలిసి సులోచనుడు రంగడి కొక ఆలోచన చెప్పాడు. రంగడు నాలుగు చిన్న రాళ్ళు తీసుకుపోయి షావుకారు కిచ్చి, దాచి ఉంచమన్నాడు. షావుకారు వాటిని తెచ్చి సులోచనుడికి చూపాడు. సులోచనుడు వాటిని చాలాసేపు పరీక్షించి, "ముడిరత్నాలు! సానపట్టాలి. ఒక్కొక్కటి అయిదారు వేలు చెయ్యవచ్చు," అన్నాడు.

తరవాత సులోచనుడు రంగడితో, "ఇప్పుడు షావుకారును నీ డబ్బు అడిగి తీసుకో," అన్నాడు. షావుకారు రంగడికి వాడి డబ్బుతోబాటు మరేవో నాలుగు రాళ్లిచ్చి పంపి, రంగడిచ్చిన రాళ్ళను సులోచనుడికి చూపి, సాన పట్టించమన్నాడు.

"రత్నాలు కావు, రాళ్ళే! వాటిని రంగడికి నేనే ఇచ్చాను. వెయ్యి అబద్ధాలాడి ఒక పెళ్లి చెయ్యమన్నారు. రంగడి కూతురి పెళ్ళి కోసం ఒక్క అబద్ధం ఆడాను," అన్నాడు సులోచనుడు.

—కలువకొలను సదానంద





# అందమైన భార్య

ఒక గ్రామంలో రాముడూ, కృష్ణుడూ అనే స్నేహితులుండేవారు. వారు చిన్నతనం నుంచీ కలిసి చదువుకుని, పెద్దయాక తమ గ్రామంలోనే స్థిరపడ్డారు. ఒకరికి ఏ సమస్య వచ్చినా రెండోవారిని సంప్రదించుకునేవారు.

వారిలో రాముడు సౌందర్య పిపాసి. అందమైన వస్తువులు వాడడమూ, అందంగా బట్టలు ధరించటమూ, అందంగా కనబడడమూ అతనికి చాలా ఇష్టం. అలాగే అందమైన భార్యను పెళ్ళాడాలన్న కోరిక కూడా అతనిలో ఉండేది.

తలవని తలంపుగా రాముడి తండ్రికి గుండెపోటు వచ్చింది. వైద్యసహాయం లాభించలేదు. చనిపోతూ ఆయన తన కొడుకుచేత తన మేనకోడల్ని పెళ్లాడేటట్టు ప్రమాణం చేయించాడు.

అతని మేనత్త కూతురు రుక్మిణి చామనచాయలో, సంసార పక్షంగా ఉంటుంది. అయినా తండ్రికి మాట ఇచ్చిన కారణంగానూ, కృష్ణుడు ప్రోత్సహించినందువల్లనూ రాముడు ఆ పిల్లను పెళ్ళాడడానికి ఇష్టం లేకపోయినా, ఒప్పుకున్నాడు.

రుక్మిణి చిన్నతనం నుంచీ కష్టాలలో పెరిగి, ఎంతో ఓర్పూ, అణకువా కలిగి, అన్ని పనులూ ఒళ్ళు వంచి శ్రద్ధగా చేసుకునేది. కాపరానికి వచ్చినాక కూడా ఆమె పదిమంది పనివాళ్ళ పెట్టుగా ఉండి, ఇంటి పని ఎంతో చాకచక్యంతో చేసేది. రాముడు తెల్లవారి నిద్ర లేచే లోపల రుక్మిణి ఇంటి పని అంతా పూర్తి చేసి, ఇల్లు అద్దంలా ఉంచి, తాను స్నానం చేసి, తరవాత తన భర్తను నిద్ర లేపేది.

“ మురళీధర్ ”

అయినా రాముడికి తన భార్య పట్ల ఏమంత మంచి అభిప్రాయం ఉండేది కాదు. అందమైన భార్యను చేసుకోలేక పోయానే అన్న దిగులు అతన్ని ఎప్పుడూ బాధిస్తూనే ఉండేది.

ఇలా ఉండగా ఒక రోజు కృష్ణుడు రాముడి వద్దకు వచ్చి, తనకు ఒక సంబంధం వచ్చిందనీ, పెళ్ళి చూపులకు తనతోపాటు రాముడు కూడా రావాలనీ కోరాడు. రాముడు అందుకు ఒప్పుకుని, కృష్ణుడికి తన ఇంటనే భోజనం పెట్టి, అతనితోబాటు పెళ్ళికూతుర్ని చూడటానికి బయలుదేరాడు.

పెళ్ళికూతురు పార్వతి అసామాన్య సౌందర్యవతి. సౌందర్య ప్రియుడైన రాముడు ఆమె నుంచి తన చూపు తిప్పుకోలేకపోయాడు. సంబంధం కృష్ణుడికి నిశ్చయమయింది. రాముడు తన స్నేహితుణ్ణి పైకి అభినందించాడే గాని, లోపల చాలా ఈర్ష్యపడ్డాడు.

పార్వతి తన మిత్రుడి భార్య అయినప్పటి నుంచీ రాముడికి తన భార్య రుక్మిణి మీద పూర్తిగా విముఖత్వం ఏర్పడింది. ఆమె తనకు శ్రద్ధగా చేసే సేవలకు అతనిలో ఆమె పట్ల కృతజ్ఞతా భావం కూడా కలగలేదు.

కృష్ణుడు ఇంటివాడైన కొద్ది రోజులకు రాముడు తన మిత్రుడి కాపరం ఎలా ఉన్నదో చూడాలనిపించి, అతని ఇంటికి వెళ్ళాడు.



బారెడు పొద్దెక్కినా, ఇంటి ముందు ఊడ్చి, కళ్ళాపిచల్లిన లక్షణాలు లేవు. కృష్ణుడు తన స్నేహితుణ్ణి లోపలికి ఆహ్వానించాడు. ఇల్లంతా చిందరవందరగా ఉన్నది. కృష్ణుడి ముఖంలో ఆనందం తాండవిస్తున్నట్టు రాముడికి తోచలేదు

ఇంతలో పార్వతి అటుగా వచ్చింది. ఆమెను చూసి రాముడు బిత్తరపోయాడు. జుట్టురేగి, జిడ్డు ముఖంతోనూ, నిద్ర కళ్ళతోనూ, ఆమె అప్పుడే లేచినట్టు కనబడింది. ఆమె రాముడి కేసి నిర్లక్ష్యంగా చూసి, తన భర్తను లోపలికి తీసుకుపోయింది.

లోపలికి పోతూ కృష్ణుడు, "ఇప్పుడే వస్తారా! కూర్చో!" అన్నాడు.

రాముడు ముళ్ళ మీద కూర్చున్నట్టు కూర్చుని, లోపల కృష్ణుడు రహస్యంగా తన భార్యతో ఏదో చెప్పుతున్నట్టు గ్రహించాడు.

కృష్ణుడి మాట వినపడలేదు గాని, పార్వతి గట్టిగానే, "అడ్డమైనవాళ్ళకూ వండి వార్చటానికి ఇది ధర్మసత్రం కాదు. కాకపోయినా, ఊళ్లోనే ఉంటున్న వాడికి భోజనాలేమిటి?" అనడం రాముడికి వినిపించింది.

కృష్ణుడు చప్పున ఇవతలికి వచ్చి చూసేసరికి, రాముడు ఇల్లు దాటి వెళ్ళిపోతూండడం కనబడింది. తన స్నేహితుడికి తన భార్య అన్న మాటలు ఎంత బాధ కలిగించాయో అని కృష్ణుడు నొచ్చుకున్నాడు. కాని పార్వతి రాముడికి ఎంత మంచి గుణపాఠం నేర్పిందో అతను ఊహించలేదు.

ఇంటికి పోతూ రాముడు, "అందం అంటే ఏమిటి?" అని తనను తాను ఒకటికి రెండుసార్లు ప్రశ్నించుకున్నాడు. తరవాత ఇల్లు చేరుతూనే అతను తన భార్యను చూసి తన ప్రశ్నకు సమాధానం తెలుసుకున్నాడు.

రుక్మిణి అంత అందమైన మనిషిని తాను ఎన్నడూ చూసి ఉండలేదని రాముడికి అనిపించింది.





# దేవీ భాగవతం

బ్రహ్మమానస పుత్రులలో ధర్ముడు అనేవాడు దక్షప్రజాపతి కూతుళ్ళలో పది మందిని పెళ్ళాడాడు. ధర్ముడికి నలుగురు కొడుకులు. హరీ, కృష్ణుడూ, నరుడూ, నారాయణుడూ అనేవాళ్ళు, కలిగారు. వారిలో పెద్దవారిద్దరూ యోగాభ్యాసంలో పడి, యోగులయారు.

నరనారాయణులు హిమాలయ పర్వతం మీదికి వెళ్ళి, మందాకినీ నదీ తీరాన వెయ్యి సంవత్సరాలపాటు తపస్సు చేశారు. ఆ తపస్సుకు కొండలు చలించాయి, భూమి కంపించింది. ఎవరు తీవ్రమైన తపస్సు చేసినా ఇంద్రుడికి ముందు కాళ్ళు చల్లబడటం పరిపాటి. అందుచేత అతను నరనారాయణుల తపస్సును భంగంచేయ తలచి, తన ఐరావతం మీద నరనారాయణులున్న చోటికి చేరి, ఏనుగు దిగి, వారిని సమీపించి, "మహాత్ములారా, మీరు ఏ ఆశయంతో తపస్సు చేస్తున్నారు? మీ తపస్సు చూసి పరమానందం చెంది మీరు కోరిన వరం ఇయ్యవచ్చాను. నేను ఇంద్రుణ్ణి. మీ తపస్సు చాలించండి," అన్నాడు.

తపస్సమాధిలో ఉన్న నరనారాయణులు ఇంద్రుడి మాటలు వినిపించుకోలేదు, జవాబు కూడా చెప్పలేదు.

ఇంద్రుడికి కోపం వచ్చింది. బుద్ధి వికటించి, అతను ఒక మాయను సృష్టించాడు. దాని ఫలితంగా, సింహాలూ, పులులూ, చిరుతపులులూ, తోడేళ్ళూ,

11. నరనారాయణులు



పాములూ వేలకువేలుగా పుట్టుకొచ్చాయి. ఎటు చూసినా వరదలూ, కార్చిచ్చులూ కనిపించాయి. వీటితోబాటు చీకటి ముంచుకువచ్చింది. ఆ చీకట్లో రాళ్లవాన కురిసింది. కాని ఈ ఇంద్రజాలానికి నరనారాయణులు చలించక, తమ తపస్సులో తాము ఉండిపోయారు.

వరం ఇస్తామంటే వినిపించుకోలేదు; పులులనూ, శీతోష్ణాలనూ లక్ష్యపెట్టలేదు; ఈ నరనారాయణుల తపస్సు ఎలా భంగం చెయ్యాలో ఇంద్రుడికి తెలియలేదు. మహాదేవి తాలూకు వాగ్బీజమూ, మాయాబీజమూ, కామబీజమూ జపిస్తూ, తపస్సు చేసుకునేవారిని కదలించటం ఎవరికీ సాధ్యం కాదని తెలుసుకుని, ఇంద్రుడు స్వర్గానికి తిరిగి వెళ్ళి, వసంతుణ్ణీ, మన్మధుణ్ణీ పిలిచి, ఇలా అన్నాడు:

"నరనారాయణులు అనేవారు బదరికాశ్రమంలో దీక్షగా తపస్సు చేస్తున్నారు. అది మనకు మంచిదికాదు. వారి తపస్సు మాన్పించాలని నేను వెళ్ళి, వరాలిస్తాను కోరుకోమంటే నా మాట వినిపించుకున్నారుకారు. అందుకని తుఫానులూ, కార్చిచ్చులూ, క్రూరమృగాలూ సృష్టించాను. దానికీ చలించారుకారు. ఇది నీవల్ల తప్ప మరెవరివల్లా కాదని నిన్ను పిలిపించాను, మన్మథా! నువు వసంతుణ్ణీ, తగిన అప్సరస్త్రీలనూ వెంట బెట్టుకుని వెళ్ళి, ఈ పని చెయ్యాలి. హరిహర బ్రహ్మదులను జయించిన నీకు ఈ మనుషులు ఒక లెక్కా? రంభ మొదలుగా గల అప్సరలలో ఏ ఒకతె అయినా చాలు తపోభంగం చెయ్యటానికి. నువు అనేక మంది అప్సరలను వెంట బెట్టుకుపో. వారి ముందు ఏ తపస్సూ నిలవలేదు."

దానికి మన్మధుడు, "దేవా, నేను నీ కింకరుణ్ణి. నీ ఆజ్ఞ పాలించటం నా విధి. అయినా ఒక్క భయం, నా మనసులో ఉన్నది, చెప్పుకోనియ్యండి. మీరు చెప్పిన హరిహర బ్రహ్మలను గురించి తపస్సు చేసేవారికి తపోభంగం

చెయ్యగలనుగాని, దేవిని గురించి తపస్సు చేసేవారి తపస్సు పాడుచెయ్యటం నా తరంకాదు. కామబీజం హృదయంలో ఉంచుకుని ధ్యానించేవారి జోలికి వెళ్ళే ధైర్యం నాకు లేదు. ఈ నరనారాయణు లనే వాళ్ళు ఆదిశక్తికి భక్తులు. వాళ్ళను నా బాణాలు ఏమీచెయ్యలేవు,'' అన్నాడు.

అయినా ఇంద్రుడు, ''సూటిగా నీ బాణాలతో వారిని జయించలేకపోతే ఏదైనా మాయోపాయం చెయ్యి. ఇది దేవ కార్యం! దీన్ని నువు సాధించి తీరాలి,'' అన్నాడు.



మన్మథుడు ఇంకేమీ అనక, ముందుగా వసంతుణ్ణి బదరికాశ్రమానికి పంపించి, వెనకగా తాను కూడా రంభ మొదలైన అప్సరసలతో అక్కడికి వెళ్ళాడు.

అప్పటికే ఆశ్రమం వసంతశోభతో చాలా అందంగా ఉన్నది. రకరకాల చెట్లు పుష్పించి ఉన్నాయి. గాలి నిండా సువాసనలు చెలరేగి ఉన్నాయి. చిలుకలు గుంపులు గుంపులుగా చెట్ల మీద చేరి అరుస్తున్నాయి. కోయిలలు కూస్తున్నాయి. తుమ్మెదలు ఝుంకారం చేస్తున్నాయి.

నరనారాయణులు తమ చుట్టూ కలయ జూసి, శిశిరరుతువులో ఈ వసంత లక్షణాలు ఎలా వచ్చాయా అని ఆశ్చర్య పడ్డారు. తమకు తపోభంగం కలిగించటానికి ఇంద్రుడు చేసిన పన్నాగమే అయి ఉండవచ్చునని వారికి అనుమానం కలిగింది.

ఇంతలో, మేనక మొదలైన అప్సరలను పదహారు వేల యాభై మందిని వెంట బెట్టుకుని, కోయిలలనూ, చిలుకలనూ తోడు తెచ్చుకుని, విల్లుతోనూ, పూల బాణాల పొదితోనూ మన్మథుడు వచ్చి, వారి ఎదట నిలిచాడు. నరనారాయణులు తపస్సు చాలించి, మన్మథుడి కేసి కొంచెం ఆశ్చర్యంతో చూశారు.

అప్పుడు అప్సరలు నరనారాయణులకు నమస్కారం చేసి, కామోద్రేకం కలిగించే పాట పాడారు. వారి ఆటలూ,



పాటలూ చూసి ఆశ్చర్యపడుతూ నరనారాయణులు ఇలా అన్నారు:

"మా తపస్సు భగ్నం చెయ్యటం కోసం మీ యజమాని అయిన ఇంద్రుడు మిమ్మల్నీ, వసంతుణ్ణీ, మన్మథుణ్ణీ పంపాడు. అతని ఈర్ష్య తెలుస్తూనే ఉన్నది. ఏమైనా, మా మాటలు కొంచెం ఆలకించండి. పాపం, ఆడకూతుళ్ళు, మీరు చాలా దూరం నుంచి వచ్చి, అలసి ఉన్నారు. ఈ ఆశ్రమంలో మీరు మా ఆతిథ్యం స్వీకరించి, విశ్రమించండి. ఆ ఇంద్రుడు పొమ్మంటే వచ్చారుగాని, మీ అంతట మీరు ఇక్కడికి వస్తారా? ఇంద్రుడి చాదస్తంగాని, మా తపస్సు పాడు చెయ్యటం మీ తరమా? చూడండి. మా తపశ్శక్తితో మీ అందరి అందాన్నీ తలదన్నే స్త్రీని సృష్టించగలం!"

నారాయణుడు తన కుడి తొడ మీద చేతితో కొట్టాడు. వెంటనే ఊర్వశి, (తన చెలికత్తెలతో సహా,) పుట్టుకొచ్చింది. ఆమె అందం చూచి నిర్ఘాంతపోయి, అప్సరలు మునులతో ఇలా అన్నారు:

"మహాత్ములారా, మమ్మల్ని క్షమించండి! మీ తపశ్శక్తి తెలియక, తపోభంగం చేయాలనే దురుద్దేశంతో మేం వచ్చాం. లోగడ ఎందరెందరు మునీశ్వరుల వ్రతాలనో చెడగొట్టాం. కాని మా శక్తి మీ ముందు ఎందుకూ పనికిరాదు. ఒక విధంగా, ఇంద్రుడు మీ తపస్సు పాడు చెయ్యటానికి మమ్మల్ని పంపటం మా మహాభాగ్యమే!"

నారాయణుడు ఈ మాటలకు చిరునవ్వు నవ్వి, "మీరీ ఊర్వశిని వెంటబెట్టుకుపోయి, దేవేంద్రుడికి కానుకగా ఇయ్యండి," అన్నాడు.

దానికి అప్సరలు, "మహాత్మా, మమ్మల్ని వెళ్ళమనవద్దు. మీరు మీ తొడల నుంచి సృష్టించిన ఊర్వశీ, తదితర స్త్రీలూ ఇంద్రుడి వద్దకు పోతారు. మమ్మల్ని మీ సేవచేస్తూ ఇక్కడే ఉండనియ్యండి," అన్నారు.

"మీరు నా నుంచి ఏం కోరుతున్నారు?" అని నారాయణుడు వారిని అడిగాడు.

"మీవంటివారు మాట తప్పరు. మా కోరిక తీర్చదలిస్తే, మాకు నువు భర్త కావాలి. ఇందుకు ఒప్పుకో. లేకపోతే మేం అనాథలం! మాకు నువు ఉంటే స్వర్గం అవసరం లేదు," అన్నారు ఆ దేవకాంతలు.

"చలికీ, ఎండకూ, గాలికీ తట్టుకుని చేసిన తపస్సు మీ యౌవనం పాలు చేయటం మంచిదా?" అని నారాయణుడు అన్నాడు.

"మునీశ్వరా, దేవవేశ్యలమైన మాతో అంతులేని సుఖాలనుభవిస్తూ, గంధమాదనపర్వతం మీద జీవించటం కంటె విశేషమైన జీవితం స్వర్గంలో మాత్రం ఏమున్నది?" అన్నారు అప్సరలు.

నారాయణుడు తాను తప్పు చేసినట్టు గ్రహించాడు. అప్సరలు తమ తపస్సు పాడుచేయ వచ్చారని తెలిసినాక తాను మౌనంగా ఉండిపోవలసింది. అలా చేయక తాను తన ధర్మానికే విరుద్ధంగా, వారికంటె అందమైన స్త్రీని సృష్టించటం పొరపాటు. వారిని శృంగారాలాపాలలోకి దిగనియ్యటం ఇంకా పొరపాటు. మహా మోహపాశం తనను చుట్టనే చుట్టింది!



వారి మీద ఆగ్రహం తెచ్చుకుని, తరిమి వెయ్యాలని నారాయణుడికి ఆలోచన వచ్చిందిగాని, ఆగ్రహం హింసకు దారి తీస్తుందని భయపడి, ఏమి చెయ్యటానికీ పాలుబోని స్థితిలో పడ్డాడు.

నరుడు ఇది గ్రహించి, "మిత్రమా, కోపం ఎటువంటి వారికీ తగదు. అహంకారం కారణంగానే గదా పూర్వం మనకూ ప్రహ్లాదుడికీ ఘోరమైన యుద్ధం జరిగింది. వీళ్లను శాంతంగానే పంపించు." అని నారాయణుడితో అన్నాడు.

ఆ మాటతో నారాయణుడు మనశ్శాంతి పొంది, "నేను ఈ స్థితిలో స్త్రీలతో విహారాలు చెయ్యటం ఊహించరాని విషయం.



అందుచేత మీరు ప్రస్తుతానికి స్వర్గానికి తిరిగి వెళ్ళండి. నాకు వ్రతభంగం కాకుండా ఇప్పుడు అనుగ్రహించారంటే, ద్వాపరయుగంలో మీ ఇష్ట ప్రకారం ఆచరించగలను. దేవతల కోరిక ప్రకారం నేను భూమి మీద పుట్టుతాను. మీరు రాజకుమార్తెలుగా పుట్టి, రకరకాలుగా నాకు భార్యలు కండి.'' అన్నాడు.

ఆ మాట మీద అప్సరలు ఊర్వశి మొదలైన వారితో స్వర్గానికి తిరిగివెళ్ళి, ఇంద్రుడికి జరిగినదంతా చెప్పారు.

ఊర్వశి సౌందర్యం చూసి ఇంద్రుడు దిగ్భ్రమ చెంది, నరనారాయణుల శక్తిని మెచ్చుకున్నాడు.

తరవాత నరనారాయణులు తమ తపస్సు తాము నిర్విఘ్నంగా కొనసాగించారు.

తరవాత వాళ్ళు భృగుడి శాపం కారణంగా కృష్ణార్జునులై జన్మించారు. కృష్ణావతారానికి పూర్వ కథ ఇలా జరిగింది:

ఒకసారి భూదేవి ఇంద్రుడి వద్దకు వెళ్ళి, తాను భారం మొయ్యలేకుండా ఉన్నానని మొర పెట్టుకున్నది. ఇంద్రుడు ఆమెను చూసి జాలిపడి, ''నీ కింత దుఃఖం కలగటానికి కారణం ఏమిటి?'' అని అడిగాడు.

భూదేవి ఇలా చెప్పింది:

భూభారం కలిగిస్తున్న దుర్మార్గులు జరాసంధుడూ, శిశుపాలుడూ, కంసుడూ, రుక్మి, నరకుడూ, సాల్వుడూ, కేశీ, ధేనుకుడూ, వత్సకుడూనూ. వీళ్లు పరమ దుర్మార్గులు; ఒకరి నొకరు ద్వేషించుకుంటూ అధర్మంగా ప్రవర్తిస్తున్నారు. వీరి భారం దుర్భరంగా ఉన్నది. వెనక హిరణ్యాక్షుడి బాధ నుంచి నన్ను కాపాడటానికి విష్ణువు వరాహావతారం ఎత్తాడు. ఆ విధంగానే యిప్పుడీ భారం నుంచి తప్పించమని భూదేవి ఇంద్రుణ్ణి వేడుకున్నది.

''నీ భారం తీర్చటానికి నేనేపాటి వాణ్ణి? బ్రహ్మ వద్దకు పోతే, ఆయన

ఏదైనా ఉపాయం చెబుతాడేమో! నేను కూడా వస్తాను. ఇద్దరమూ ఇప్పుడే బయలుదేరి పోదాం." అన్నాడు ఇంద్రుడు.

ఇద్దరూ కలిసి బ్రహ్మ వద్దకు వెళ్లారు. బ్రహ్మ కూడా భూదేవిని, ఇంద్రుడు అడిగినట్టుగానే, నీకు వచ్చిన కష్టం ఏమిటని అడిగాడు.

"కలి రాబోతున్నది. అధర్మం పెచ్చు మీరుతుంది. రాజులు ఔదార్యం విడిచి పెట్టి దొంగలుగా తయారు కాబోతున్నారు. ఇది భారం కాదా? దుర్మార్గుల నందరినీ నిర్మూలించి, నా బరువు తగ్గించరాదా?" అన్నది భూదేవి.

"తల్లీ, నీ కోరిక తీర్చే శక్తి నాకు లేదు. అందుకు విష్ణువే తగినవాడు. అతడి వద్దకు పోదాం," అని బ్రహ్మ తన హంస వాహనం మీద దేవతలనూ, భూదేవినీ వెంటబెట్టుకుని, వైకుంఠానికి వెళ్ళాడు. విష్ణువు అందరినీ వేరు వేరుగా కుశల ప్రశ్నలు చేసి, వాళ్ళు వచ్చిన పని అడిగాడు. "భూదేవి భారం మొయ్యలేనంటున్నది. అందుచేత నువు ద్వాపర యుగాంతంలో అవతారం ఎత్తితే మంచిది. అనాథలను ఉద్ధరించటానికి నీ కన్న వేరెవరున్నారు?" అన్నాడు బ్రహ్మ విష్ణువుతో.

"యోగమాయ ముందు నువూ, నేనూ, శివుడూ, దేవతలూ అస్వతంత్రులం. అందుచేత ఆమె ఏం చెయ్యమంటే మనం అలా చేతాం. ఆమె ప్రేరణతోనే కదా నేను ముందు కొన్ని అవతారాలెత్తాను? అంతేగాని చేపగానూ, పందిగానూ ఇతర క్షుద్రజంతువులుగానూ అవతరించటంలో సుఖమూ, పుణ్యమూ మరో సారస్యమూ, ఏమున్నదని? రామావతారం ఎత్తి, అడవుల పాలై, భార్యను పోగొట్టుకుని, ఎన్ని దురవస్థలకు గురి అయాను కాను? నా కుండిన స్వేచ్ఛ ఏమిటి? అందుచేత మీరు ఆ జగదంబను వేడుకోండి. మీ పని తీరుతుంది," అన్నాడు విష్ణువు బ్రహ్మ మొదలుగాగల వారితో.






వడ్రంగి సాంబయ్యకు ఇద్దరు కొడుకులు. పెద్దవాడు శివరాముడు నగరంలో వర్తకుల కింద పనిచేస్తున్నాడు. రెండోవాడు గోవిందుడు తండ్రిలాగే వడ్రంగం నేర్చుకుని, ఇంటి దగ్గిరేవుండి తండ్రికి సహాయం చేస్తున్నాడు.

గోవిందుడు తన అన్నను చూడటానికి నగరం వెళ్లిన సమయంలో సాంబయ్యకు గుండె పోటు వచ్చింది. గోవిందుడు తిరిగి వచ్చేదాకా తాను బతకననిపించి, సాంబయ్య తన పొరుగున ఉన్న గొప్ప షావుకారు భూషయ్యను పిలిపించి, అతనికి ఒక సంచీ ఇస్తూ, ''ఇందులో అయిదు వేల రూకలున్నాయి. వీటిని నా కొడుకులకు ఇచ్చి, దీని మూలంగా వాళ్ళు సోమరులైపోకుండా, సుఖంగా బతికేటట్టు మీరు చూడాలి,'' అని వేడుకున్నాడు.

భూషయ్య ఒప్పుకుని ఆ డబ్బు సంచీ తీసుకుని తన ఇంట్లో పెట్టి, మళ్ళీ వచ్చే సరికి, సాంబయ్య ప్రాణం పోనే పోయింది. వెంటనే నగరంలో ఉన్న సాంబయ్య కొడుకులకు కబురు వెళ్లింది. వాళ్ళు వచ్చి తండ్రికి ఉత్తరక్రియలు చేశారు. వాళ్ళకు అలమారులో తండ్రి రాసిపెట్టిన చీటీ ఒకటి కనబడింది. భూషయ్యకు కబురు పెట్టకముందే సాంబయ్య తన కొడుకుల పేర ఒక చీటీ రాసిపెట్టి, దాన్ని అలమారులో ఉంచాడు.

''నేను చాలా కాలంగా పోగు చేసిన డబ్బు అయిదు వేలు ఉన్నది. దాన్ని షావుకారు భూషయ్యగారికి ఇస్తాను. మీరు ఆయన సలహా ప్రకారం దాన్ని వినియోగించుకుని, సోమరులు కాకుండా సుఖంగా బతకండి,'' అని ఆ చీటీలో ఉన్నది.

ఎమ్. వి. వి. సత్యనారాయణ

నప్పుడు మాత్రం సాంబయ్య చనిపోయి ఉన్నట్టూ వాళ్ళకు తెలిసింది. సాంబయ్య భూషయ్యకు డబ్బు ఇచ్చేముందు చీటీ రాసి ఉండవచ్చుగాని, చచ్చే ముందు డబ్బు ఇచ్చాడనటానికి సందేహం లేదు. ఇంట్లో ఎక్కడా అంత పెద్ద మొత్తం కనబడ లేదు.

సాంబయ్య కొడుకులు భూషయ్యకు గుణపాఠం నేర్పటానికి నిశ్చయించుకుని, అందుకు ఒక పథకం కూడా వేసుకుని. భూషయ్య మాటలు నమ్మినట్టుగా నటించారు.



సాంబయ్య కొడుకులు ఆ చీటీని తీసుకుపోయి భూషయ్యకు చూపితే, భూషయ్య ఎంతో నొచ్చుకున్నట్టు నటిస్తూ, "పాపం, మీ నాయన నాకు డబ్బు ఇద్దామనుకున్నాడు కాబోలు! కాని ఇచ్చే లోపునే మృత్యువు పిలుచుకుపోయింది! ఇల్లంతా జాగ్రత్తగా వెతకండి," అని సలహా ఇచ్చాడు.

మోసం తలపెట్టి, భూషయ్య అబద్ధం ఆడుతున్నాడని సాంబయ్య కొడుకులు తెలుసుకున్నారు. ఎందుకంటే సాంబయ్య చావకముందే ఒకసారి భూషయ్య వచ్చి, సాంబయ్యతో ఏదో రహస్యంగా మాట్లాడి వెళ్లినట్టూ, రెండోసారి భూషయ్య వచ్చి

శివరాముడు భూషయ్య వద్దకు వెళ్ళి, "మా నాన్న పోతూ, పోతూ మిమ్మల్ని చూపాడు. ఇప్పుడు మీరే మాకు పెద్ద దిక్కు. మా గోవిందుడు వడ్రంగం చేసుకుంటూ ఇక్కడే ఉంటానంటున్నాడు. వాణ్ణి ఒంటరిగా విడిచిపోలేను. నాకు కూడా ఇక్కడే పొట్టపోసుకునే మార్గం ఏదన్నా చూపండి," అని అడిగాడు.

"మా ఇంటి జమా ఖర్చులు చూస్తూ నా దగ్గిరే పని చెయ్యి. ఆమాత్రం సహాయం చెయ్యలేనా?" అన్నాడు భూషయ్య.

శివరాముడు భూషయ్య ఇంట చేరి, ఇంట్లో అందరి విశ్వాసానికీ పాత్రుడయే విధంగా నడుచుకుంటూ, వాళ్ళ కుటుం

బంలో మనిషిలాగా అయిపోయాడు. అతనికి ఆ ఇంటి గుట్టుమట్లు అన్నీ తెలిసిపోయాయి.

భూషయ్య తన డబ్బు యావత్తూ ఒక భోషాణం పెట్టెలో పెట్టి, దాన్ని నలుగురూ తిరిగే నట్టింటనే ఉంచి, అందులో పాత బట్టలూ, ఇతర విలువలేని వస్తువులూ తప్ప ఇంకేమీ లేనట్టు దాని మీద ఒక పాత బట్ట కప్పి ఉంచేవాడు. అయితే ఇంటి వారిలో ఎవరో ఒకరు అస్తమానమూ ఆ భోషాణాన్ని ఒక కంట కనిపెట్టే ఉండేవారు.

శివరాముడు అవకాశం దొరికినప్పుడు ఆ భోషాణం పెట్టె కొలతలు రాసి పెట్టుకున్నాడు.

ఒకనాటి రాత్రి భూషయ్య ఇంటి తలుపు ఎవరో తట్టారు. భూషయ్య నిద్ర కళ్ళ లేచి తలుపు తీశాడు. బయట ఎవరో రాజకుమారుడిలాగా బట్టలు వేసుకుని ఉన్నాడు. అతని వెనక చీకట్లో కొందరు మనుషులున్నారు.

రాజకుమారుడు భూషయ్యకు నమస్కరించి, "ఈ ప్రాంతంలో మిమ్మల్ని మించిన ధనికుడు లేడని విన్నాం. మాది పొరుగు రాజ్యం. అకస్మాత్తుగా మాకు ఆపద వచ్చి పడింది. నేను కొంత సొత్తు దక్కించుకుని బయటపడ్డాను. నా ధనమంతా ఈ పెట్టెలో ఉన్నది. దాన్ని మీ వద్ద దయఉంచి భద్రపరిచినట్టయితే, మంచి రోజు రాగానే నేనే వచ్చి పట్టుకు





పోతాను. మీరు ఈ సహాయం చేసినట్ట యితే, మీ ఉపకారం మరిచిపోను,'' అన్నాడు.

అప్పుడుగాని భూషయ్య పెట్టెను చూడ లేదు. అది బయటి అరుగు మీద పెట్టి ఉన్నది. దాని మీద మఖ్మల్ గుడ్డ కప్పి ఉండటంచేత చీకట్లో కలిసిపోయింది.

భూషయ్య పెట్టెను తన ఇంట ఉంచు కోవటానికి ఒప్పుకున్న మీదట రాజకుమా రుడి మనుషులు ఆ పెట్టెను లోపలికి తెచ్చారు. అది కూడా భోషాణం పెట్టే. భూషయ్య తన పెట్టెను జరిపి చోటు చేసి, రాజకుమారుడి పెట్టెను తన భోషాణం పెట్టె పక్కనే పెట్టించాడు.

రాజకుమారుడు సెలవు పుచ్చుకుని తన మనుషులతో వెళ్ళిపోయాడు. భూషయ్య తన అదృష్టాన్ని తలుచుకుని మురిసిపోతూ పడుకున్నాడు. ఈ రాజ కుమారుడికి మంచి రోజులు రాకపోతే ఆ పెట్టె తనదే! ఒకవేళ మంచి రోజులు వస్తే, తనకు జీవితాంతమూ ఆ రాజకుమా రుడి అండ ఉంటుంది!

ఇలా అనుకుంటూ భూషయ్య నిద్ర లోకి జారాడు.

తరవాత కొద్దిసేపటికి రాజకుమారుడి పెట్టె మీద ఉండిన మఖ్మల్ గుడ్డ జారి కింద పడింది. దాని తలుపు పైకి లేచింది. అందులోనుంచి గోవిందుడు పైకి వచ్చాడు. వాడు మళ్ళీ ఆ పెట్టెను మూసి, భూషయ్య పెట్టె మీది పాతగుడ్డ దాని మీద కప్పి, తన పెట్టె మీద ఉండిన మఖ్మల్ గుడ్డను భూషయ్య పెట్టె మీద కప్పి, నిశ్శబ్దంగా దొడ్డి తలుపు తెరుచు కుని వెళ్ళిపోయాడు.

భూషయ్య మంచి గాఢ నిద్రలో ఉండగా ఎవరో కొట్టి లేపారు. భూషయ్య ఉలిక్కిపడి లేచి కూర్చుని, తన మంచం పక్కన ఎవడో సాయుధభటుడిలాటి వాడు ఉండటం చూసి కంగారుపడుతూ, "ఎవరు మీరు? లోపలికి ఎలా వచ్చారు?" అని అడిగాడు.

భటుడు పరుషంగా, "నేను ప్రశ్న లడుగుతాను, నువ్వు చెప్పు! పొరుగు రాజు కొంతసేపటి కింద మీ ఇంటికి వచ్చి, రెండు పెట్టెలు మీ ఇంట దాచి నట్టు తెలిసింది. వాట్ని వెతికి పట్టుకోమని కొత్త రాజుగారి ఆజ్ఞ," అన్నాడు.

భూషయ్య వణికిపోయాడు.

"ఆ రాజు అప్పుడే వెళ్ళిపోయాడు. మా ఇంట ఏదో పెట్టె ఉంచాడు. అందులో ఏమున్నదో నాకు తెలీదు. కావలిస్తే ఆ పెట్టె తీసుకుపో, బాబూ!" అన్నాడు అతను.

భటుడు పక్క పక్కనే ఉన్న రెండు భోషాణం పెట్టెలూ చూసి, "ఈ రెండూ వాడివే!" అన్నాడు.

అందులో సాదాబట్ట కప్పినది తనదనీ, మఖ్మల్‌బట్ట కప్పినది మాత్రమే ఆ రాజు దనీ భూషయ్య ప్రమాణాలు చేసిన మీదట భటుడు, "సరే, పెద్దమనిషివని నీ మాట నమ్ముతున్నాను," అంటూ కేక పెట్టి మనుషులను లోపలికి పిలిచి, మఖ్మల్ బట్ట కప్పి ఉన్న భోషాణం పెట్టెను పట్టించుకుపోయాడు.

ఆ పెట్టెలోనే భూషయ్య డబ్బంతా ఉన్నది. చాలా సేపటికి భూషయ్య తేరు కుని, పెద్ద ఆపద తప్పిందనుకుంటూ, పాత గుడ్డ తొలగించి, భటుడు వదిలి పోయిన భోషాణం పెట్టె మూత ఎత్తాడు. అందులో ఏమీ లేదు.

డబ్బంతా పోయినందుకు తెల్లవారిన దాకా ఇంటిల్లిపాతీ శోకాలు పెట్టారు. తెల్లవారి శివరాముడు వచ్చి, జరిగిన సంగతి విని, తాను కూడా శోకాలు పెట్టి, "ఇంక నేను మీ ఇంటి జమా ఖర్చులు ఏం చూసేది? ఉన్నదంతా ఖర్చే అయి పోయింది!" అని కళ్ళు తుడుచుకుంటూ సెలవు పుచ్చుకున్నాడు.

తరవాత కొద్ది రోజులకే సాంబయ్య రహస్యంగా దాచిన డబ్బు కొడుకులకు దొరికిందని ఊళ్ళో పుకారు లేచింది. శివరాముడు ఆ డబ్బుతో వర్తకం మొదలు పెట్టాడు కూడా.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1979 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







P. Sundaram B. Bhansali

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అగస్టు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: గుప్పెడు మెతుకులకని

రెండవ ఫోటో: తవ్వ చేరావేమోనని

పంపినవారు: జి. రామకృష్ణ, శ్రీ బాలాజీ లాడ్జ్, అనంతపురం.

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.

# శత్రు సంహారం!







































గట్టి పళ్ళకోసం, పిప్పిపళ్ళు రాకుండా నిరోధించడంకోసం——బినాకా ఫ్లోరైడ్.


DADDY
MUMMY
AND...
I


EKCO
SKETCH PEN
FOR
SKETCHING
COLOURING & SIGNING

# పాపిన్స్ కాగితంతో తమాషా

## రామ్, శ్యామ్

మీకిష్టమైన ఇద్దరూ, మరో కొత్త కాగితపు చిటకా; చెయ్యటం మరెంతో గమ్మత్తు

### ఉషారైన టోపీలు

వెడల్పుకన్నా 1½ రెట్లు పొడుగు గల కాగితం తీసుకోండి. (అంటే న్యూస్ పేపర్ కాగితపు తావు ఒకటి చక్కగా సరిపోతుంది).



చుక్కలుపెట్టిన గీతవైపు తిన్నగా, కాగితాన్ని మడిచి, ఆ మడతను విప్పండి. ఇప్పుడు మళ్ళీ కాగితాన్ని రెండుగా, అంటే చుక్కలు పెట్టిన మరొక కాగితపు గీతలవైపు బాణాలున్న తీరులో, మడవండి.



పక్కవైపు మడవండి.



క్రిందవున్న పక్క కాగితాల్ని పైకి మడవండి—ఒకటి ఒక వైపుగానూ, మరొకటి మరొక వైపునూ. అంటే, మీ టోపీ తయారు; దాన్ని పెట్టుకుని ఫక్కుమని నవ్వండి.




పార్లే
పాపిన్స్
పండ్లరుచిగల పిప్పరమెంట్లు
నోరూరించే...మనసుదోచే...మైమరపించే

everest/78/PP/248-tl